# HOLY BAPTISM

BY

The Right Reverend V. S. AZARIAH

*Bishop of Dornakal*

Translated into Telugu from Tamil

BY

Rev. G. KANTAYYA, B.A., L.T.

# పరిశుద్ధ బాప్తిస్మము

ఇది

మహా ఘనతవహించిన

వి. ఎస్. అజరియ. దోర్నకల్ అధ్యక్షులవారివల్ల

అరవములో ప్రచురింపబడినది

రెవరెండు గా. కాంతయ్య, బి.ఏ., ఎల్.టి., వల్ల

తెనిగింపబడినది.

MADRAS:

PRINTED AT THE S.P.C.K. PRESS, VEPERY

1919



# పీఠిక.

విషయములను ప్రతిష్ఠించు క్రమములో అడుగబడు ప్రశ్నలలో నొకటి ఏమనిన:—

“దైవవాక్యమునకు విరుద్ధమయిన యావత్తు అన్యబోధను తప్పు సిద్ధాంతమును పూర్ణమైన జాగ్రత్త “వినియోగించి పారద్రోలుటకు సిద్ధముగానున్నావా? మరియు రహస్యముగాను బాహాటముగాను ఈ కార్య “మందు ఇతరులనుకూడా ప్రేరేపించి హెచ్చరించెదవా!”

ఉత్తరము.—“ప్రభువు నాకు సహాయుడైయుండగా ఆలాగు చేయుటకు సిద్ధముగానున్నాను.”

ఈ ప్రత్యుత్తరములో పూనుకొనిన బాధ్యతను నెరవేర్చుటకై ఈ పుస్తకము వ్రాయబడినది. తెలుగుదేశములో పరిశుద్ధ బాప్తిస్మమునుగూర్చి ఏదో ఒకవిధమైన తప్పభిప్రాయములును వాడుకలును గలిగిన యనేక తెగల వారున్నారు. మొట్టమొదట, ఈ సంస్కారమునకు బదులుగా జండాక్రింద ప్రమాణమును వాడెడు రక్షణ సైన్యమువారున్నారు. తరువాత బాప్తిస్టు లున్నారు: వారు చిన్నపిల్లల బాప్తిస్మము నంగీకరించరు, విశ్వాసుల బాప్తిస్మ మును మాత్రమే నమ్ముదురు, మరియు ముంపుస్నానము మాత్రమే వాడుక చేయుదురు. మరికొందరు బాప్తిస్మము నంగీకరించినను, అది సభలో చేరుటకు సాక్ష్యపుగురుతుగా మాత్రము భావింతురు. హిందువులు, మన ప్రభువునందు విశ్వసించుట యవసరమని ఒప్పుకొనినను, పరిశుద్ధ బాప్తిస్మము అక్కరలే దందురు. ఈ చిన్నపుస్తకము పలువిధములైన ఈ తరగతులవారినందరిని ఉద్దేశించి వ్రాయబడినది. దీనిలో పరిశుద్ధ బాప్తిస్మమునుగూర్చి పరిశుద్ధ లేఖనముల లోనుండు సిద్ధాంతము ఫలానిదనియు, ఇంగ్లాండు సభవారి ఉపదేశమును వాడుకయును తదనుకూలముగ నున్నదనియు, చూపుటకు ప్రయత్నించితిమి. సభానాయకుడు తానే ఈ చిన్నపుస్తకమును తెలుగుదేశములో తన రాజ్య వ్యాపకముకొరకు ఉపయోగించును గాక.

మొదట అరవములో వ్రాయబడిన ఈ పుస్తకమును రెవరెండు గానుగపాటి కాంతయ్యగారు తెలుగులోనికి తర్జుమాచేసిరి. ఈ పనిలో మనస్ఫూర్తిగ సహాయముచేసినందుకు ఆయనకు హృదయపూర్వకముగ వందనములాచరించుచున్నాను.

దోర్నకల్,
1 వ సెప్టెంబరు అన 1919 సం॥ }

V. S. దోర్నకల్.

# విషయసూచిక.

# పరిశుద్ధ బాప్తిస్మము.

## 1-టి అధ్యాయము.

### బాప్తిస్మములు.

"బాప్తిస్మము" లేక "స్నానము" అను తెలుగుపదము "బాప్తిస్మా" అను గ్రేకు పదములోనుండి వచ్చినది. ఈ మూలపదమైన గ్రేకు క్రియకు "ముంచు" లేక "స్నానముచేయించు" అనునవి అసలు అర్థములు. ఒక ఓడ నీటిలో మునిగిపోవుటను, లేక, ఒకడు దుఃఖసాగరములో మునిగియుండుటను తెలుపుటకు, గ్రేకు పురాతనగ్రంథములు, ఈ పదమునే ప్రయోగించెను. కాని రాగా రాగా ఆ విధమైన ఉపయోగము నిలిచిపోయి, ఒక ఆచారకర్మగా జరుగుచున్న శుద్ధీకరణమునకు మాత్రము ఈ పదము వాడబడినట్లు కనబడుచున్నది. నూతన నిబంధనకాలమందు ఇదే యీ పదము యొక్క సాధారణమైన ఉపయోగము. ఈ క్రిందనున్న వాక్యములవల్ల అది మనకు బాగుగ తెలియును:—

(1) పరి. లూకా 11: 38. "ఆయన భోజనమునకు ముందుగా చేతులు **కడుగుకొనలేదని**, ఆ పరిసయ్యుడు చూచి ఆశ్చర్యపడెను." **కడుగుకొనలేదని** తెలిగింపబడిన పదము మనము పైనచెప్పిన గ్రేకు పదమే. ఆచారసంబంధమైన శుద్ధీకరణమును ఆ పదము తెలుపునేగాని, స్నానమును తెలుపదు.

(2) పరి. మార్కు 7: 4. "వారు సంతనుండి వచ్చునప్పుడు **స్నానము** చేసితేనేగాని భోజనముచేయరు. ఇదియుగాక గిన్నెలను కుండలను ఇత్తడి పాత్రలను నీళ్లలో **కడుగుట** మొదలగు అనేకాచారములను వారనుసరించు చుండినవారు." "**స్నానము**," "**కడుగుట**" అను రెండు పదములకును గ్రేకు పదములు **బాప్తిస్త** అను ధాతువుతో చేరిన పదములే. ఇక్కడను ఆచారసంబంధమైన శుద్ధీకరణమును సూచించుటకే యీ పదము ప్రయోగింపబడినది.

(3) హెబ్రీ 9: 10. "ఇవి దిద్దుబాటు జరుగుకాలము వచ్చువరకు విధింపబడి, అన్నపానములతోను, నానావిధములైన ప్రక్షాళనములతోను సంబంధించిన శరీరాచారములు మాత్రమైయున్నవి" ఇక్కడను ప్రక్షాళనములనునది అదే అర్థముగల పదము. ఆచారసంబంధమైన శుద్ధీకరణమనే దీనికి అర్థము.

యేసునాథుడు తాను పొందబోవు శ్రమలను తలంచుకొని ఒక పోలికగా ఈ పదమును రెండుచోట్ల వాడెను. ఒకటి, పరి. మార్కు 10: 38, 39. "నేను పొందుచున్న బాప్తిస్మముపొందుట మీచేతనగునా?" రెండవది. పరి. లూకా 12: 50. "నేను పొందవలసిన బాప్తిస్మమున్నది." శ్రమలు, హింసలు ఆయనమీద వరదవలె పొర్లి పారుటను ఈ పదము సూచించును.

నూతన నిబంధనలో "బాప్తిస్మ" అను పదమువచ్చు ఇతరమైన అన్నిచోట్ల లోను, నీటిలో కడుగుట యను ఒక యాచారమును సూచించునేగాని వేరు కాదు. "బాప్తిస్మ" అను పదమును దాని క్రియారూపములును గ్రీకు నూతన నిబంధనలో 104 పర్యాయములు వచ్చును. పైన కనుపరచబడిన 6 చోట్లలో తప్ప మిగిలిన 98 చోట్లలోను "బాప్తిస్మము"నియే తర్జుమాచేయబడి యున్నది. ఒకడు తన అపరిశుద్ధమైన పాతబ్రతుకును విడిచి, పరిశుద్ధమైన నూతనజీవములో ప్రవేశించు సమయమందు ఆ యపవిత్రతను పోగొట్టు శుద్ధీకరణ యాచారమునకు ఈ పేరు వాడబడెనని యూహింపవచ్చును.

## 1. అన్నికాలముల శుద్ధీకరణములు.

నీటిలో దేహమును కడిగి, కర్మసంబంధమైన యపవిత్రతను పోగొట్టుటకు శుద్ధిచేయువాడుక అన్నిదేశములలోను కనుపించును. మన హిందూదేశములో నిది బహు విశేషమైన సంగతి. గుడిలో దేవుని పూజించుటకు పోకముందును, బలిచెల్లించకముందును, వంటచేయకముందును, భోజనముచేయకముందును, చావు ఇంటికి వెళ్లి వచ్చినతరువాతను, శ్మశానభూమినుండి తిరిగివచ్చినప్పుడును, ఇంకను నానావిధ సమయములందును హిందూమతస్థులు నీటిలో స్నానముచేసి, అశుచిని పోగొట్టుకొనుట సహజము. మరియు ఒకానొక విశేషమైన స్థలమందలి జలము లోపలిఅపవిత్రతను పోగొట్టునను తాత్పర్యము జనుల మనస్సులో బలముగా నాటబడియున్నట్టు మనకు తెలియును. దేవాలయములకుముందు కోనేరులుండుటయు, గంగ, గోదావరి, కృష్ణ మొదలైన నదీ తీరములు యాత్రాస్థలములుగా చేసికొనుట దీనికి దృష్టాంతము.

మహమ్మదీయులు మసీదుకు పోకముందు స్నానము చేయుటయు, శరీరమును కడుగుకొనుటయు, ఈ సంగతినే తెలుపును. ఉత్తర హిందూస్థానమందుండు సిక్కుమతస్థులును ఈ వాడుకగలవారే చీనా జపాన్ దేశములలో నుండు కంఫ్యూషియస్ మతస్థులును అలాగే నీటిలో తమ్మును శుద్ధిచేసికొని జపమంత్రములు చెప్పుకొనుటకు పోదురు.

ఉత్తరమున ఐస్లాండు అను ఒక ద్వీపములో పూర్వకాలమందు ఒక నాడుక ఉండినట్టు చెప్పుదురు క్రీస్తుమతము అక్కడికి పోకముందు (అనగా క్రీ. శ. 1,000 లకు ముందు) ఒక పిల్ల పుట్టగానే; ఆ పిల్లను చంపివేయవలెనా, బ్రతుకనియ్యవలెనా అని తండ్రిని అడుగుదురట. పెంచవలెనని అతడు చెప్పినట్టయితే, పిల్లమీద కొంచెము నీటినిపోసి దానికి పేరు పెట్టుదురట. ఆ కర్మ జరిగినతరువాత ఎవరైనను ఆ పిల్లను చంపినట్టయితే అది నరహత్యగా ఎంచబడునట.[1] ఆ పిల్లను కుటుంబములో చేర్చుటకు ఈ కర్మ నెరవేర్చిరని తోచుచున్నది. నీటిని ప్రయోగించుటచేత శుద్ధిచేసికొనుటయు అంనుమూలముగ జనసముదాయమందు చేర్చుకొనుటయు, మానవస్వభావమందు సహజముగా నాటబడియున్న యొక అభిప్రాయమని యీ దృష్టాంతములవల్ల స్పష్టమగుచున్నది. ఈ యభిప్రాయమునకు అనుకూలముగానే ప్రభువు బాప్తిస్మమను ఆచారమును నియమించెనని యీ దృష్టాంతముల నుండి యూహింపవచ్చును.

## 2. యూదమతములోని శుద్ధీకరణాచారములు.

ఇతర మతములలోనున్న యీ యాచారము యూదమతములో నుండెను. యూదుడొకడు తనను ప్రభువుకు ప్రతిష్ఠించుకొనవలసియున్న యెడలను, అపవిత్రత పోవునట్లు తనను శుద్ధిచేసికొనవలెనని యెడలను, నీటిలో స్నానము చేయవలెనని విధి. యాజకులు మొట్టమొదట ప్రతిష్ఠింపబడునపుడు తమ్మును కడుగుకొని శుద్ధిచేసికొనవలెననియు (లేవీ. 8: 6). పిమ్మట ప్రతిదినము ప్రత్యక్షపుగుడారములో ప్రవేశించునప్పుడు తమ్మును కడుగుకొనవలెననియు విధింపబడియున్నది (నిర్గమ 30: 20, 21). కుష్ఠరోగులు బాగుపడి తిరిగి పాళెములో చేరవలెననియను, (లేవీ. 14: 8, 9.) చచ్చినదానిని తినినవాడు ఆ దోషము పోయి పవిత్రుడుకావలెనననియను (లేవీ. 17: 15, 16). శరీరముయొక్క పలువిధములైన అపవిత్రతలవల్ల అపవిత్రులైనవారు దేవుని సన్నిధికి రావలెనననియను

[1] Hasting's Dictionary of the Bible, Art. 'Baptism.'

(లేవీ. 15: 8—13; 16: 23—28), చట్టము ఇదే. కుష్ఠుపొడ కలిగిన యొక యింటిని పవిత్రపరచవలసినప్పుడు, హిస్సోపును రక్తములోను పారు నీటిలోను ముంచి ఆ యింటిమీద ప్రోక్షింపవలెనని విధింపబడెను. (లేవీ. 14: 50, 51.) రక్తము ప్రాయశ్చిత్తమునకును జీవజలము పవిత్రపరచుటకును గురుతు.

నీటిలో కడుగుట ఒకని అపవిత్రతను పోగొట్టి, దేవునితో మనుష్యుడు సహవాసము చేయుటకు మార్గము కలుగజేయుననియే ఈ శుద్ధీకరణముల యుద్దేశము.

## 3. యూదమతస్థుల స్నానము.

ఒక యూదుడు ఆయా సమయములందు అపవిత్రుడైనయెడల నీలాగు పవిత్రపరచబడుట అవశ్యమైయుండగా, యూదమతములో చేరదు అన్యుడు ఈ పవిత్రపరచెడు ఆచారమును ఆచరించుట ఎంతో యెక్కువగా అవశ్యమై యుండునుగదా! మన ప్రియరక్షకుడు అవతారమెత్తుటకు పూర్వమే యూదుల రబ్బీలు ఈలాగు చేసినట్టు చాలినంత సాక్ష్యమున్నది.[1] ఒక అన్య జాతివాడు ఒడంబడికలో చేరినవాడు—అనగా అన్నివిషయములలో పూర్ణ మైన యిశ్రాయేలీయుడుగా—ఎంచబడగోరితే, అతడు మూడు పనులు చేయ వలెను:—(1) సున్నతి పొందవలెను. (2) స్నానము పొందవలెను. (3) బలి యర్పింపవలెను, అని కట్టడయుండెను.[2] ధర్మశాస్త్రమును అతనికి ఉపదేశించిన వారిలో ముగ్గురు అతనికి జామీనుదారులుగా నిలుచుండి, అతనిని ఒక ఏటి యొద్దకు తీసికొనిపోయి, కంఠమువరకు నీటిలో నిలిపి, ధర్మశాస్త్రములోని ఆజ్ఞలను అతనిమీద చదువుదురు. వీటిని గైకొందునని అతడు ప్రతిజ్ఞచేసిన పిమ్మట వానిమీద ఆశీర్వాదము చెప్పుదురు. అతడప్పుడు నీటిలో సంపూర్ణముగా మునిగి పూర్ణమైన ఇశ్రాయేలీయుడుగా బయటకు ఎక్కివచ్చును. అన్యజాతి స్త్రీలను యూదసభలో చేర్చుటకు స్నానమును బలియును చాలునని విధియుండెను.

కాని యెరూషలేము దేవాలయము పాడుచేయబడినందున బలులర్పించుట ఆపివేయబడినప్పుడు స్నానముచేతమాత్రమే స్త్రీలు యూదసభలో చేర్చుకొనబడిరి.[3] పురుషులు సున్నతిపొంది స్నానముచేత పవిత్రపరచబడిరి.

---

[1] Dictionary of Christ and the Gospel, Art. 'Baptism.'
[2] The Religion and Worship of the Synagogue, p. 281.
[3] Dictionary of the Bible (Hastings) Art. 'Baptism.'

కలాగు, విగ్రహారాధనవల్లను అపవిత్రమైన భోజనమువల్లను అపవిత్రపరచబడిన అన్యులు ఆ యపవిత్రతను పోగొట్టుకొని యూదసభలో చేరుటకు నీటిలో స్నానము ద్వారముగా నుండెను. యూదసభలో బాప్తిస్మము శుద్ధీకరణ యాచారమై యుండెననుటకు సందేహములేదు.

## 4. స్నానికుడైన యోహాను ఇచ్చిన స్నానము.

యేసు రక్షకునికిముందు దూతగావచ్చిన యోహాను ఇచ్చిన స్నానమును గూర్చి నూతననిబంధన ఆరంభమందు చదువుచున్నాము. ఈయన స్నానము ఇచ్చుటనుబట్టి యీయనకు **స్నానికుడని** పేరుకూడా వచ్చెను. ఇంతవరకు మనము చూచిన యూదుల స్నానములకును యోహాను ఇచ్చిన స్నానమునకును కొన్ని భేదములున్నవి.

(i) పైన చెప్పిన అన్యమతస్థుల స్నానములు అపవిత్రుడైనవాడు తనకు తానే కడుగుకొని శుద్ధిపరచుకొను స్నానము. ఇది అపవిత్రులమని యొప్పుకొనువారు మరియొకనివల్ల పొందెడు స్నానము. తాము మారుమనస్సు పొందినందుకును, స్నానికుని బోధన అంగీకరించి, అతని శిష్యులైనందుకును రాబోవు మెస్సీయాయొక్క రాజ్యమునకు తమ్మును సిద్ధపరచుకొనినందుకును ఇది రుజువు అయ్యెను.

(ii) పైన చెప్పబడిన స్నానములు వెలపల దేహముయొక్క అపవిత్రతలను తీసివేయుటకు జరిగింపబడెను. యోహానైతే హృదయములోని పాపమును నివర్తిచేయుటకు బాప్తిస్మమిచ్చెను. పాపమును ఒప్పుకొని విడిచిపెట్టుటే నూతనబ్రతుకునకు మొదటిమెట్టు. అన్యాయమైన లాభమును వెతికిన సుంకరులును, బీదలమీదల బలాత్కారముచేసిన రాణువవారును, స్వప్రీతిపరులైన ధనవంతులును, పొందిన స్నానము, ఇకమీదట మేము మా నడతను దిద్దుకొందుమని వారు ఒప్పుకొన్నందుకు సాక్ష్యము. వెలపలి శుద్ధీకరణమును స్నానికుడైన యోహాను మొట్టమొదట లోపల పరిశుద్ధపరచుటకు గురుతుగా చేసెను.

(iii) యోహాను ఇచ్చిన స్నానమునకును యూదమతమవలంబించిన వారు పొందిన స్నానమునకును ఇంకొక ముఖ్యమైన భేదమున్నది. యూదుల స్నానము రాష్ట్రికులకుమాత్రము ఇయ్యబడెను. యోహాను స్నానమైతే యూదులకును ఇయ్యబడెను. అన్యమతసంబంధమైన అపవిత్రతలను విడిచిపెట్టి యూదసభలో చేరగోరు రాష్ట్రికులకు విశేషమైన శుద్ధీకరణము అవసరమని ఏ యూదు

నైనను ఒప్పుకొనును. కాని యూదునికికూడా నిది యవసరమని యూదు లంగీకరించుట కష్టము. పుట్టుక కాదు కాని నడతయే ప్రధానమనియు, యూదు లందరు తమ దుర్నీతియైన నడతచేత మెస్సీయాయొక్క రాజ్యమునకు తమను అపాత్రులనుగా చేసికొని రాష్ట్రికులవలెనే అపవిత్రులైరనియు, ఆ రాజ్యములో పాలుపొందుటకు కోరువారు మారుమనస్సుపొంది స్నానముపొందుట అవశ్య మని యోహాను స్థాపించెను.

అప్పుడు జరిగినదేమి? "యెరూషలేమువారును యూదైయవారందరును" (మత్తయి 3: 5, 6). రోమానురాజ్యములో అక్కడక్కడ చెదిరియున్నవారు కూడా ఎవరైతే ఆత్మీయమైన దాహము గలిగియుండిరో, ఎవరైతే మెస్సీయా రాకకొరకు ఆశతో యెదురుచూచుచున్నారో, వారందరును యోహాను ఇచ్చిన బాప్తిస్మముపొంది, క్రీస్తుసభకు సిద్ధపడిన సభలో చేరినవారైరి.

సత్యావతారమూర్తియైన యేసునాథుడు పొందిన బాప్తిస్మమును ఇదే. యూదసభలో సత్యవిజ్ఞానముగలవారి తరగతిలో తానుకూడా చేరవలెనని ప్రభువు తీర్మానించుకొనెను. ఒప్పుకొనుటకును, రోసివేయుటకును ఆయనలో పాపము లేకపోయినను. యూదులలో సద్భక్తులతో తనను ఒకనిగా చేసికొను టకు దీనిని మార్గముగా చేసికొనెను.

ఆరంభమందు కొంతకాలము యేసుప్రభువుయొక్క శిష్యులు ఇచ్చిన స్నానము ఇదియే. యోహాను తన పని ముగింపకముందు చెరసాలలో వేయ బడినందున యేసునాథుడు తన పరిచర్య ఆరంభమందు తన రాకకొరకు సిద్ధ పరచునట్టి యీ పనిని చేయవలసివచ్చెను. యోహాను చెరసాలలో వేయబడిన తరువాత యేసు . . . దేవునిరాజ్యము సమీపించియున్నది; మారుమనస్సుపొంది సువార్త నమ్ముడి, అని ప్రకటించెను. అదే యోహాను ఇచ్చిన యీ సిద్ధపరచు బాప్తిస్మము. అనగా మారుమనస్సును సూచించు దీక్షాస్నానమునే ఆయన శిష్యులును ఇయ్యవలసివచ్చెను.

ఈ స్నానమునకును క్రీస్తుసభలోని స్నానమునకును బహు భేదమున్నది. యోహాను తానే చెప్పినట్లు ఇది మారుమనస్సుకు గురుతైన బాప్తిస్మము. సభ యొక్క బాప్తిస్మము పాపపరిహార స్నానము. ఇది దేవుని రాజ్యముకొరకు సిద్ధ పరచుటకు ఇయ్యబడిన స్నానము. పరిశుద్ధసభయొక్క బాప్తిస్మము దేవుని రాజ్యములో ప్రవేశపెట్టెడు స్నానము. ఇది ఉత్త గురుతుమాత్రమే. అది సభయొక్క మతసంబంధమైన దీక్షను తెలుపు సంస్కారము.

## 5. క్రీస్తుసభయొక్క బాప్తిస్మము.

పెంతెకొస్తుదినమందే ఇది మొట్టమొదట యియ్యబడెను. ఎవరైతే యేసు ప్రభువును విశ్వసించి సభలో చేరగోరిరో వారు బాప్తిస్మముద్వారా సభలో చేర్చబడిరి. అప్పటినుండి నేటివరకు ఈ బాప్తిస్మమును పొందినవారే క్రైస్తవు లనియు, విశ్వాసులనియు పిలువబడుచున్నారు.

ఇంకొక బాప్తిస్మమునుగూర్చి నూతననిబంధనలో చదువుచున్నాము. అదే దనిన:—

## 6. పరిశుద్ధాత్మలో బాప్తిస్మము.

పరి. లూకా 3: 16. "నేను నీళ్లతో మీకు బాప్తిస్మమిచ్చుచున్నాను. అయితే నాకంటె శక్తిమంతుడొకడు వచ్చుచున్నాడు; ఆయన పరిశుద్ధాత్మతోను అగ్నితోను మీకు బాప్తిస్మమిచ్చున"ని స్నానికుడైన యోహాను చెప్పెను. యేసు ప్రభువు తానుకూడా పరలోకమునకు ఆరోహించకముందు, "యోహాను నీటితో బాప్తిస్మము నిచ్చెనుగాని కొద్దిదినములలోగా మీరు పరిశుద్ధాత్మతో బాప్తిస్మముపొందెదరు"ని చెప్పిపోయెను (అపొ. కార్య. 1: 4). స్నానికుడు చెప్పినమాట యేసుప్రభువు ఈలాగు ఒప్పుకొనడమైనది. పెంతెకొస్తుదిన మంగు పరి. పేతురు, "ఆయన దేవుని కుడిపార్శ్వమునకు హెచ్చింపబడి పరి శుద్ధాత్మనుగూర్చిన వాగ్దానము తండ్రివలన పొంది, మీరు చూచుచు వినుచు నున్న దీని కుమ్మరించియున్నాడ"ని (అపొ. కార్య. 2: 23.) చెప్పి యీ వాగ్దా నము నెరవేరినట్లు రుజువుపరచెను. **ఇదే యేసునాథుడు ఇచ్చిన పరి శుద్ధాత్మ బాప్తిస్మము.** 'పరిశుద్ధాత్మ బాప్తిస్మము' అను మాట అపొ. కార్య. 1: 4. తరువాత దైవగ్రంథములో మరి యెక్కడను రాదు. ఇది ఒక పోలిక మాట పరిశుద్ధాత్మ దిగివచ్చుటయే యీలాగు పోల్చబడియున్నది. పరిశుద్ధాత్మ వరము పరిశుద్ధసభలో నెల్లప్పుడుండుటకొరకు ఒక్కసారే పెంతెకొస్తుదిన మందు కుమ్మరింపబడెను. సభయొక్క అవయవములకు దీనికి పాక్కు కలుగు. కాని ఒక్క విశ్వాసి పరిశుద్ధాత్మ బాప్తిస్మముపొందెనని బైబిలులో నెక్కడను చెప్పియుండలేదు. పరిశుద్ధాత్మ బాప్తిస్మము పరిశుద్ధసభయంతయు మొత్తముగా పొందిన స్నానము.

నీటిస్నానమిచ్చుట తప్పని కొందరు ప్రస్తుతకాలమందు చెప్పుటకు తెగిం చుదురు. ఇంతవరకు చెప్పబడిన చరిత్ర చదివినవారు నీటిస్నానము వేరు, పరి శుద్ధాత్మస్నానము వేరని చెప్పబడినట్లు సులభముగా కనిపెట్టుదురు. పెంతే

కోస్తుదినమందు పరి. పేతురు—"మీరు మారుమనస్సుపొంది పాపక్షమాపణ నిమిత్తము ప్రతివాడు యేసుక్రీస్తు నామమున బాప్తిస్మముపొందుడి; అప్పుడు మీరు పరిశుద్ధాత్మ అను వరము పొందుదురు"ని చెప్పుటచేత, ఇవి రెండును వేరని స్పష్టముగా ప్రకటించెనుగదా? మరియు కొర్నేలియింటిలో పరిశుద్ధాత్మ ప్రత్యక్షముగా దిగినతరువాత, పేతురు—"మనవలె పరిశుద్ధాత్మను పొందిన వీరు బాప్తిస్మముపొందకుండ ఎవడైనను నీళ్లకు ఆటంకముచేయగలడా?" అని చెప్పుట చూచినప్పుడు ఇవి రెండును వేరని తెలియుచున్నది. నీళ్లస్నానమే బాప్తిస్మము. 'పరిశుద్ధాత్మ స్నానము' 'అగ్నిలో స్నానము' 'శ్రమలో స్నానము' అనునవి అలంకారపదములు. వీటన్నిటికి ఉపమేయము నీటిస్నానమే. నీటిస్నానము లేకుండా నీలాటి యలంకారములుండ నేరవు.

అయినప్పటికి పరిశుద్ధసభ యిచ్చెడు స్నానమునకును పరిశుద్ధాత్మ బాప్తిస్మమునకును ఒక ముఖ్యమైన సంబంధమున్నది. పరిశుద్ధాత్మ బాప్తిస్మము, పరిశుద్ధ సభ, అనగా క్రీస్తుయొక్క మర్మశరీరముపొందిన స్నానము. ఆ సభయొక్క అవయవములన్నిటికి ఆ యాత్మ స్నానమందు పాలున్నది. త్రియేక దైవనామమందు ఇయ్యబడెడు నీటిస్నానము ద్వారా నే ఆ సంఘములో మనము అవయవములగుటకు స్వాతంత్ర్యముగలవారమగుచున్నాము.

గనుక నే, పరిశుద్ధాత్మ బాప్తిస్మము శ్రేష్ఠమైనదైనను, పరిశుద్ధసభాస్నానమే సాధారణముగా దానికి ద్వారము. నీటిలో బాప్తిస్మమును ఒకడు నిరాకరించి, సభలో చేరకుండినయెడల, పరిశుద్ధాత్మ బాప్తిస్మము పరలోకమునుండి వాడు పొందునని చెప్పుటకు వేదవాక్య ఆధారములేదు.

సభలో ఆదినుండి నేటివరకు వాడుకలోనున్న బాప్తిస్మమునుగూర్చియే యీ పుస్తకముయొక్క అంశము. దీనినిగూర్చి నూతన నిబంధనయు, పరిశుద్ధ సభయు చెప్పునది యిక విచారింతము.



# 2-వ అధ్యాయము.

## పరిశుద్ధసభయొక్క బాప్తిస్మము.

తండ్రియొక్క, కుమారునియొక్క, పరిశుద్ధాత్మయొక్క పేరట నీటిలో బాప్తిస్మమిచ్చెడు వాడుక ప్రస్తుతము భూలోకమందంతటనున్న క్రీస్తుసభ యంతటిలో నున్నది. రక్షణసేనవారును, "స్నేహితులసంఘము" లేక "క్వేకర్" అను పేరు కలిగిన ఒక చిన్న తెగవారుమాత్రమే దీనిని అనుసరించుటలేదు. అయినను, ఎవరికి బాప్తిస్మమియ్యవలెనో, ఎవరికియ్యకూడదో అను దానిని గూర్చియు, నీటిలో ముంచియో, నీటిని చిలకరించియో, ఏలాగు ఇయ్యవలెనో అను దానిని గూర్చియు, బాప్తిస్మముయొక్క స్వభావము, దానివలని ఫలితమును గూర్చియు, ఆయా సభలలో ఆయా యభిప్రాయములున్నవి.

క్రీస్తుసభయొక్క సకల యాచారములకును నియమములకును నూతన నిబంధనయే మూలాధారము గనుక యేసునాథుని అపొస్తలులు దీనిని అనుసరించిన విధమును, వారు దానినుండి బోధించిన యుపదేశమును మొట్టమొదట విచారించుట ఉత్తమము. ఇందుకొరకు నూతన నిబంధనలో బాప్తిస్మమునుగూర్చి యున్న వాక్యములనన్నింటిని యెత్తి వ్రాసి, వాటినుండి అపొస్తలుల కాలమందలి వాడుక, ఉపదేశము ఫలానిదని తీర్మానించుటకు ప్రయాసపడుదము.

(i) అపొ కార్య. 2: 37—40. "ఈ మాట" (అనగా వ. పేతురు ప్రసంగము) "వారు విని హృదయములో నొచ్చుకొని-సహోదరులారా, మేమేమిచేతుమని పేతురును కడమ అపొస్త "లులనడుగగా, పేతురు - మీరు మారుమనస్సుపొంది పాపక్షమాపణనిమిత్తము ప్రతివాడు యేసు "క్రీస్తు నామమున బాప్తిస్మముపొందుడి; అప్పుడు మీరు పరిశుద్ధాత్మ అను వరము పొందుదురు .. .. "మరియు వింక ననేకవిధములైన మాటలతో సాక్ష్యమిచ్చి-మీరు మూర్ఖులగు ఈ తరమువారికి వేరై రక్షణ "పొందుడని వారిని హెచ్చరించెను. కాబట్టి అతని వాక్యము నంగీకరించినవారు బాప్తిస్మముపొందిరి; "ఆ దినమందు ఇంచుమించు మూడువేలమంది చేర్చబడిరి."

ఇది క్రీస్తుమతముయొక్క ప్రథమప్రసంగము. పెంతెకొస్తుదినపు ఉపన్యాసము. ఆత్మతో సంపూర్ణముగా నింపబడినప్పుడు చేసిన యుపదేశము.

దీనిలోనుండి మన మూహింపతగిన సంగతులు అనేకములున్నవి:—

(1) బాప్తిస్మముయొక్క అవశ్యము ఇక్కడ వక్కాణింపబడుచున్నది. తమ పాపమును గ్రహించినవారై, దానినుండి విడుదలపొందు మార్గమును తెలుపుమని అడిగినవారికి అపొస్తలులు, "మీరు మారుమనస్సుపొంది బాప్తిస్మము పొందుడి" అని ప్రత్యుత్తరమిచ్చిరి.

(2) బాప్తిస్మమువల్ల కలుగులాభము ఫలానిదని యిక్కడ స్పష్టముగా వివరింపబడినది. మారుమనస్సుపొంది బాప్తిస్మముపొందువారు పాపక్షమను పరిశుద్ధాత్మను పొందుదురని చెప్పబడియున్నది.

(3) తమ పూర్వ సహవాసమును విడిచి, అపొస్తలుల సభలో చేరుటకు ఇది యొక మార్గమని యిక్కడ చెప్పబడినది. "మీరు మూర్ఖులగు ఈ తరము వారికి వేరైయుండుడ"ని అపొస్తలులు కట్టడచేసిరి.

(4) దీనికి "యేసుక్రీస్తు నామమున బాప్తిస్మము"నే పేరుకూడ నుండి నట్టు తెలియుచున్నది.

(5) బాప్తిస్మ నిబంధనయొకటి యిక్కడ చెప్పబడియున్నది; అదేదనిన, మారుమనస్సు.

(ii) అపొ. కార్య. 8: 12, 13. "ఫిలిప్పు దేవుని రాజ్యమునుగూర్చియు యేసుక్రీస్తు
"నామమునుగూర్చియు సువార్త ప్రకటించుచుండగా వారతని నమ్మిరి. పురుషులును స్త్రీలును బాప్తిస్మము
"పొందిరి. అప్పుడు సీమోనుకూడ నమ్మి బాప్తిస్మముపొంది ఫిలిప్పు నెడబాయకుండెను."

(1) బాప్తిస్మము సమరైయవారి కవశ్యమని ఫిలిప్పు బోధించినట్టు తెలిసి కొనుచున్నాము.

(2) సభలో చేరుటనుగూర్చియు, బాప్తిస్మమునుగూర్చియు, ఫిలిప్పు వారికి బోధించియుండునని తోచుచున్నది. బాప్తిస్మము అవశ్యమని అతడు నొక్కి చెప్పకున్నయెడల, వారు దాని పొందియుండరు.

(3) బాప్తిస్మనిబంధన యొకటి యిక్కడ చెప్పబడినది ఏదనిన: విశ్వాసము. నమ్మినవారు బాప్తిస్మము పొందిరి. కొద్దికాలము తరువాత దేవుని శాపము పొంది నశించిన సీమోనుకూడా ఈ సమయమందు నమ్మి బాప్తిస్మముపొందిన వారిలో నొకడు.

(4) బాప్తిస్మమిచ్చినది అపొస్తలులలో నొకడు కాదు, ఏడుగురిలో నొకడైన ఫిలిప్పు.

(iii) అపొ. కార్య. 8: 36—38. "వారు (ఫిలిప్పును, మంత్రియు) త్రోవలో
"వెళ్లుచుండగా నీళ్లున్న యొకచోటికి వచ్చినప్పుడు మంత్రి: ఇదిగో నీళ్లు, నాకు బాప్తిస్మమిచ్చుటకు ఆటంక
"మేమని యడిగి, రథము నిలుపుమని ఆజ్ఞాపించెను; అంతట ఫిలిప్పు మంత్రి ఇద్దరును దిగి నీళ్లలోని
"వెళ్లగా అతడతనికి బాప్తిస్మమిచ్చెను."

(1) యూదమతములోనున్న యొక ఐతియొపీయునకు బాప్తిస్మమవసర మని బోధింపబడెను.

(2) ఇతనికి బోధించిన పిలిప్పు యెషయా 53-వ అధ్యాయము ననుసరించి "యేసునుగూర్చి" బోధించెనని పరి. లూకా క్లుప్తముగా చెప్పినను బాప్తిస్మము పొందుటనుగూర్చియు, దానిని పొందు క్రమమునుగూర్చియు, దానివల్ల కలుగు మేళ్లనుగూర్చియు స్పష్టముగా బోధించియుండునని మన మూహింపవచ్చును. లేనియెడల నీళ్లున్నచోటికి వచ్చినతోడనే మంత్రి బాప్తిస్మము కావలెనని అడిగియుండడుగదా?

(3) ఒంటరిగా నొక దేశమునకు వెళ్లిన యితడు బాప్తిస్మముపొందుట విచారించితే, అతడు వెళ్లబోవుచోటనుండు ఒక సభయొక్క ఐక్యములో చేరుటకు బాప్తిస్మము అవసరమైనందువలన కాదుగాని, అంతటనున్న సార్వత్రిక పరిశుద్ధసభలో చేరి, రక్షణస్థితిలో ప్రవేశించుటకు అది అవశ్యమైనందువలననే, పిలిప్పుచేతితో బాప్తిస్మముపొందెనని చూచుచున్నాము.

(4) ఈ బాప్తిస్మము నీటిలో ఇయ్యబడిన బాప్తిస్మమనియు ప్రత్యక్షముగా కనుబడుచున్నది "ఇద్దరును నీళ్లలోనికి వెళ్లగా," పిలిప్పు బాప్తిస్మమిచ్చెనని చదువుచున్నాము.

(5) "నీళ్లలోనికి వెళ్లిరి" అనుటచేత నిది స్నానముచేయించుటతో బాప్తిస్మమియ్యబడినట్టు ఊహించవచ్చును.

బాప్తిస్మమిచ్చినవాడు ఏడుగురిలో నొకడైన పిలిప్పే.

(iv) అపొ. కార్య. 9: 18; 22: 16. "అప్పుడే అతని కన్నులనుండి పొలుసులవంటివి "రాలగా దృష్టికలిగి లేచి బాప్తిస్మముపొందెను."

22· 16. "అననీయ అను నొకడు నాయొద్దకు వచ్చి నిలిచి-నీవు తడవుచేయుట యేల? "లేచి ఆయన నామమునుబట్టి ప్రార్థనచేసి బాప్తిస్మముపొంది నీ పాపములను కడిగివేసికొనుమని "చెప్పెను."

ఇది అపొస్తలుడైన పౌలు బాప్తిస్మమునుగూర్చిన వివరము. దానిలోనుండి మూడు సంగతులు ఊహింపవచ్చును.

(1) దైవదర్శనమువల్ల మారుపడిన పౌలుకుకూడా బాప్తిస్మము అవశ్యమయ్యెను.

(2) పాపము పోవునట్లు కడుగబడుట బాప్తిస్మమువల్ల వచ్చెడు ఫలమని అననీయ చెప్పెను. పౌలు ప్రభువును దర్శించినప్పుడు కాదు, నేనేమిచేయుట నీకిష్టమని అడిగినప్పుడు కాదు, మూడు దినములు ప్రార్థించినప్పుడును కాదు,

కాని బాప్తిస్మము పొందినప్పుడే పాపము పోవునట్లు కనబడెనని యీ వచనము రుజువుపరచుచున్నది.

(3) బాప్తిస్మమిచ్చినవాడు ఒక అపొస్తలుడు కాడు, సువార్తికుడు కాడు, దేవునిచేత పంపబడిన అననీయ అనబడిన ఒక శిష్యుడు, అనగా సభికుడు.

(v) అపో. కార్య. 10: 47, 48. "అప్పుడు పేతురు—మనవలె పరిశుద్ధాత్మను పొందిన, "వీరు బాప్తిస్మముపొందకుండ ఎవడైనను నీళ్లకు ఆటంకము చేయగలడా అని చెప్పి, యేసుక్రీస్తు "నామమందు వారు బాప్తిస్మముపొందవలెనని ఆజ్ఞాపించెను.'

(1) అన్యజనులకును బాప్తిస్మము అవశ్యమైయున్నదని బోధింపబడినట్లు తెలియుచున్నది.

(2) పరిశుద్ధాత్మను అద్భుతముగా పొందినవారికికూడ బాప్తిస్మమవసరమని పరి. పేతురు ఎంచెను. పరిశుద్ధాత్మ వారిమీదికి దిగినపిమ్మట బాప్తిస్మమెందుకని చెప్పక, ఆయన కుమ్మరింపబడినందున బాప్తిస్మమిచ్చుటకు ఆటంకము చేయుట తప్పితమగునని చెప్పెను.

(3) ఈ బాప్తిస్మము నీళ్లలో స్నానమనియు స్పష్టముగానున్నది. "ఎవడైనను నీళ్లకు ఆటంకము చేయగలడా?" అని చెప్పుచున్నాడు.

(4) 'ప్రభువు నామమందు బాప్తిస్మము'ని యీ యాచారమునకు పరి. పేతురు ఇచ్చిన పేరని కనుబడుచున్నది.

(5) పరి. పేతురు కాదుగాని, ఆయనతోకూడ వెళ్లిన సహోదరులే బాప్తిస్మమిచ్చినట్లు ఊహింపవచ్చును. "వారు బాప్తిస్మముపొందవలెనని ఆజ్ఞాపించెను"ని చెప్పబడియున్నది.

(vi) అపో. కార్య. 16: 14, 15. "లూదియాయను దైవభక్తిగల యొక స్త్రీ వినుచుండెను. ప్రభువామె హృదయము తెరిచెను గనుక పౌలు చెప్పిన మాటలయందు లక్ష్యముంచెను. "ఆమెయు ఆమె యింటివారును బాప్తిస్మముపొందిరి."

ఇది ఐరోపాఖండములో జరిగిన మొందటి బాప్తిస్మము.

(1) సువార్త వాక్యమును అంగీకరించిన లూదియకుకూడా బాప్తిస్మము అవశ్యమయ్యెను.

(2) వాక్యమునందు లక్ష్యముంచి వినినది లూదియ. ఆమె హృదయమే తెరువబడెను కాని బాప్తిస్మము ఆమెకును ఆమె యింటివారికిని యియ్యబడెను. ఐరోపాఖండములో మొదటి బాప్తిస్మము కుటుంబ బాప్తిస్మమే.

(vii) అపొ. కార్య. 16: 30—33. "వారిని (పౌలు సీలను) వెలుపలికి తీసికొ
"నివచ్చి—అయ్యలారా, రక్షణపొందుటకు నేనేమి చేయవలెననెను? అందుకు వారు ప్రభువైన యేసు
"నందు విశ్వాసముంచుము, అప్పుడు నీవును నీ ఇంటివారును రక్షణపొందుదురని చెప్పి, అతనికిని అతని
"ఇంటనున్నవారికందరికిని దేవుని వాక్యము బోధించిరి. రాత్రి ఆ గడియలోనే అతడు వారిని తీసి
"కొనివచ్చి వారి దెబ్బల గాయములు కడిగెను; వెంటనే అతడును అతని ఇంటివారందరును బాప్తిస్మము
"పొందిరి."

ఈ బాప్తిస్మములో కొన్ని విశేషమైన సంగతులున్నవి:—

(1) అర్ధరాత్రివేళ చెరసాలలో గుణపడిన మనుష్యునికికూడా బాప్తిస్మము అవశ్యమని అపొస్తలుడు సాధించెను.

(2) రక్షణపొందుటకు నేనేమి చేయవలెననే ప్రశ్నకు అపొస్తలుడు ఇచ్చిన ప్రత్యుత్తరములో బాప్తిస్మమునుగూర్చి యేమియు చెప్పకపోయినను, ఆ రాత్రి గడియలోనే వారికి బాప్తిస్మమిచ్చుట చూడగా బాప్తిస్మముయొక్క అవశ్యత వారు ఆ కొద్దికాలములోనే చూపించియుందురని యూహింపవచ్చును.

(3) చెరసాలనాయకుడు విశ్వసించినయెడల, అతడుమాత్రము రక్షింపబడుటే న్యాయము; కాని యిక్కడ అతడును అతని ఇంటివారును రక్షింపబడుదురని అపొస్తలులు చెప్పుచున్నారు. కుటుంబపు పెద్దయొక్క విశ్వాసము ఇంటివారినందరిని రక్షణకు తగినవారినిగా చేయుచున్నదని పరి. పౌలు బోధించుచున్నాడు.

(4) బాప్తిస్మముపొందుటకు అధికముగా సవిస్తరమైన బోధయు తెలివియు అవశ్యమైనట్లు అపొస్తలులు ఎంచలేదని కనుబడుచున్నది. రాత్రివేళ కొన్ని గడియలకాలములో బోధపొంది, గుణపడి, బాప్తిస్మముపొందిరి.

(5) బాప్తిస్మముపొందిన సమయము మధ్యరాత్రికిని, ఉదయమునకును మధ్య; చెరసాలలో అపొస్తలుల గాయములను చెరసాలనాయకుడు ఎక్కడ కడిగెనో అక్కడనే అతడును, అతని యింటివారును బాప్తిస్మముపొందినట్లు కనుబడుచున్నది. కాలమును స్థలమును చూచినప్పుడు, నీటిలో స్నానము చేయించి బాప్తిస్మమిచ్చియుందురాయని సందేహించుటకు చోటున్నది.

(viii) అపొ. కార్య. 18: 8. "క్రిస్పు తన ఇంటివారందరితోకూడ ప్రభువునందు
"విశ్వాసముంచెను. మరియు కొరింథీయులలో అనేకులు విని విశ్వసించి బాప్తిస్మముపొందిరి"

(1) కొరింథులోకూడ బాప్తిస్మముయొక్క అవశ్యతనుగూర్చి అపొస్తలుడు ప్రసంగించియుండెను.

(2) బాప్తిస్మమిచ్చుటకు వేరె యెవరును లేని సమయమందు అపొస్తలుడే యిచ్చెనని చూచుచున్నాము (1 కొరిం. 1: 15, 16 చూడుము).

(3) ఇక్కడను ఒక కుటుంబముయొక్క పెద్దతో కూడా ఇంటివారందరు బాప్తిస్మముపొంది సభలో చేరిరి. ఒక యింటివారిని, ఇంటివారినిగాను, కుటుంబము కుటుంబముగాను, ప్రజలను సభలో చేర్చుటకు అపొస్తలుడు భయపడలేదు.

(4) విశ్వాసము బాప్తిస్మమునకు ఒక నిబంధనయైనట్టుగా ఎంచబడినట్లు గమనించుచున్నాము.

(ix) అపొ. కార్య. 19: 2—5. "పౌలు ఎఫెసుకువచ్చి కొందరు శిష్యులను చూచి–
"మీరు విశ్వసించినప్పుడు పరిశుద్ధాత్మను పొందితిరా అని వారినడుగగా, వారు-పరిశుద్ధాత్మ యున్నాడన్న
"సంగతియే మేము వినలేదని చెప్పిరి. అప్పుడతడు–అలాగైతే మీరు దేనిబట్టి బాప్తిస్మముపొందితిరని
"వారినడుగగా వారు-యోహాను బాప్తిస్మమునుబట్టియే అని చెప్పిరి అందుకు పౌలు–యోహాను తన
"వెనుక వచ్చువానియందు అనగా యేసునందు విశ్వాసముంచవలెనని ప్రజలతో చెప్పుచు మారుమనస్సు
"విషయమైన బాప్తిస్మమిచ్చెనని చెప్పెను. వారామాటలు విని ప్రభువైన యేసునామమున బాప్తిస్మము
"పొందిరి."

(1) యోహాను ఇచ్చిన స్నానము పొందినవారికికూడా పరిశుద్ధసభయొక్క బాప్తిస్మము అవసరమని పరి. పౌలు బోధించుచున్నాడు.

(2) యోహాను స్నానము క్రీస్తుకొరకు సిద్ధపరచే స్నానమేగాని మరియొకటికాదని అపొస్తలుడు ఇక్కడ కనుపరచుచున్నాడు.

(3) పరిశుద్ధసభా బాప్తిస్మముపొందినవారు పరిశుద్ధాత్మనుకూడా పొంది యుండవలెనని అపొస్తలుడు ఎదురుచూచుచున్నాడు. పెంతెకొస్తుదినమందు జరిగినట్లు రెండును ఏకకాలమందు జరుగగల కార్యమని దీనినుండి ఎంచవచ్చును.

(4) విశ్వాసియున్న పేరు బాప్తిస్మముపొందినవానికే తగును. "మీరు విశ్వసించినప్పుడు" అని అపొస్తలుడడిగిన ప్రశ్నను మూలభాషలో చదివితే ఒక నియమితమైన సమయమందు జరిగిన కార్యమును తెలుపుకాలముయొక్క పదము దానికి వాడినట్లు తెలియుచున్నది. "అలాగైతే మీరు దేనిబట్టి బాప్తిస్మముపొందితిర"ని అపొస్తలుడు రెండవ ప్రశ్నగా నడుగుట చూచినప్పుడు, వారు బాప్తిస్మముపొందిన సమయమందే వారు విశ్వాసులైనట్లు పరి. పౌలు ఎంచెనని తెలిసికొనవచ్చును. ఒకడు యేసునాథుని ఒప్పుకొన్న సమయమందు

కాదు, లేక, ఆయనను అంగీకరించి, ఆయనకు ప్రార్థించినప్పుడు కాదు కాని, ఆయనాజ్ఞ ప్రకారము పరిశుద్ధ బాప్తిస్మముపొందెదుకాలమందే, అతడు విశ్వాసియగును. "రహస్యవిశ్వాసి" అని ప్రస్తుతకాలమందు వాడబడు చున్న పేరు అపొస్తలుని భాషలో నుండనేలేదు.

(5) పరిశుద్ధసభయొక్క బాప్తిస్మమునకు "ప్రభువైన యేసునామమున బాప్తిస్మము" అనే పేరు ఇక్కడను వాడబడియున్నది.

(6) పరి. పౌలు తానే బాప్తిస్మమియ్యక, తనతోనున్నవారు ఇచ్చినట్టు తెలియుచున్నది. 'వారు ప్రభువైన యేసునామమున బాప్తిస్మముపొందిరి. పౌలు వారిమీద చేతులుంచినప్పుడు, పరిశుద్ధాత్మ వారిమీదికి వచ్చెన'ని చెప్ప బడినందున చేతులుంచు పనిమాత్రము పరి పౌలు చేసినట్టు ఊహింపవచ్చును.

(ד) **రోమా 6: 3, 4.** "క్రీస్తు యేసులోనికి బాప్తిస్మముపొందిన మనమందరము "ఆయన మరణములోనికి బాప్తిస్మముపొందితిమని మీరెరుగరా?" ...."మనము బాప్తిస్మమువలన మర "ణములో (పాలుపొందుటకై) ఆయనతోకూడ పాతిపెట్టబడితిమి."

ఇది రోమాపురిలోని క్రైస్తవులకు పరి. పౌలు సుమారు క్రీ. శ. 58 లో వ్రాసినది.

(1) రోమాపురిలోకూడా విశ్వాసులని యెంచబడినవారందరును బాప్తిస్మముపొందినట్టు చూచుచున్నాము.

(2) ఆ బాప్తిస్మమునకు "క్రీస్తుయేసులోనికి బాప్తిస్మము" అని పేరు ఇయ్యబడెను.

(3) అది "క్రీస్తు మరణములోనికి బాప్తిస్మము" అని పౌలు రుజువుచేయు చున్నాడు. అనగా, ఆయన మరణములో పాలు కలుగచేయు బాప్తిస్మము అని చెప్పెను.

(4) 'బాప్తిస్మమందు పాతిపెట్టబడితిమి' అని చెప్పుట చూడగా, ముంపు స్నానము చేయించు క్రమమును తలంచుకొని అపొస్తలుడు మాట్లాడుచున్నట్టు కనుపించుచున్నది.

(5) బాప్తిస్మమిచ్చు క్రమము ఆత్మసంబంధమైన లోపలి కృపకు ఒక ఆన వాలుగానున్నట్టు అపొస్తలుడు మాట్లాడుచున్నాడు. బహిరంగమైన స్నానము క్రైస్తవుడు తన పాతబ్రతుకునకు చచ్చినవాడై పాతిపెట్టబడుటకు ఆనవాలుగా చూపబడినదట.

(xi) 1 కొరింథి 1: 14—17 "పౌలు నామమున మీరు బాప్తిస్మముపొందితిరా? నా నామమున మీరు బాప్తిస్మముపొందితిరని యెవరైనను చెప్పకుండునట్లు, క్రిస్పునకును గాయునకును తప్ప మరి యెవరికిని నేను బాప్తిస్మమియ్యలేదు; అందుకై దేవునికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించుచున్నాను. స్తెఫను యింటివారికిని బాప్తిస్మమిచ్చితిని; వీరికి తప్ప మరి యెవరికైనను బాప్తిస్మమిచ్చితినేమో నేనెరుగను. బాప్తిస్మమిచ్చుటకు క్రీస్తు నన్ను పంపలేదు. సువార్త ప్రకటించుటకే ఆయన నన్ను పంపెను."

క్రీ. శ. 52లో కొరింథుసభ స్థాపింపబడెను. ఈ పత్రిక క్రీ. శ. 55 లో వ్రాయబడెను.

(1) కొరింథులో క్రైస్తవులైనవారందరును బాప్తిస్మముపొందినవారని అపొస్తలుడడిగిన ప్రశ్నవల్ల తెలియుచున్నది.

(2) అవశ్యమైనందునవేగాని మరియొక హేతువుచేత అపొస్తలుడు తానే యెవనికిని బాప్తిస్మమియ్యలేదని మాచుచున్నాము. ఇతరులు లేనప్పుడు ఆయనే యిచ్చెను. అపొ. కార్య. 18: 8.

(3) ఒకరి నామమున బాప్తిస్మముపొందినవారు ఆ నామము ధరించిన వారిని సంబంధించియుందుమని ప్రతిజ్ఞచేసినవారని ఒక ప్రమాణమును ఇక్కడ అపొస్తలుడు స్థాపించుచున్నాడు.

(4) తనకు ప్రభువిచ్చిన ఆజ్ఞలో బాప్తిస్మమియ్యమని చెప్పనందున అది తన ప్రధానకర్తవ్యము కాదనుచున్నాడు. బాప్తిస్మము అంత ముఖ్యమైనదికాదని యెంతమాత్రమును పరి. పౌలుయొక్క అర్థముకాదు.

(xii) 1 కొరింథి 10: 2. "వారందరును మోషేనుబట్టి మేఘములోను సముద్రములోను బాప్తిస్మముపొందిరి."

ఈ వచనములో పరి. పౌలు బాప్తిస్మమను పదమును ఉపమానరీతిగా ఉపయోగించుచున్నాడు. బాప్తిస్మమనునది యేలాగు ఒకని పాతబ్రతుకు నుండి వేరుచేయుచున్నదో, ఆలాగే యెఱ్ఱసముద్రము ఇశ్రాయేలు జనులను ఐగుప్తునుండి వేరుపరచెను. మేఘముక్రింద మోషేచేత నడిపింపబడి సముద్రమును దాటినవారు క్రీస్తులో బాప్తిస్మముపొందినవారికి సరిపోలియున్నారని చెప్పుచున్నాడు.

(xiii) 1 కొరింథి 12: 13. "యూదులమైనను, హెల్లేనీయులమైనను, దాసులమైనను, స్వతంత్రులమైనను మనమందరము ఒక్క శరీరముగానుండుటకు ఒక్క ఆత్మయందే బాప్తిస్మము పొందితిమి. మనమందరమొక్క ఆత్మను పానముచేసినవారమైతిమి."

(1) కొరింథులోని క్రైస్తవులందరును బాప్తిస్మముపొందిరని దీనివల్ల తెలియుచున్నది. "**మనమందరము**" అని అనుచున్నాడు.

(2) బాప్తిస్మమనునది క్రీస్తుయొక్క ఒక్క శరీరమందు మనలను అవయవములనుగా చేయుచున్నదని చెప్పుచున్నాడు. "**ఒక్క శరీరమందు.**"

(3) బాప్తిస్మమందు దొరికే ఆత్మీయమైన కృప ఆత్మవల్లనే కలుగునని బోధించుచున్నాడు.

(xiv) 1 కొరింథి 15: 29. "మృతులేమాత్రమును లేపబడనియెడల మృతులకొరకై బాప్తిస్మముపొందువారేమిచేతురు? మృతులకొరకు వారు బాప్తిస్మముపొందనేల!"

ఇదియొక కష్టమైన వాక్యము. దీనికి వ్యాఖ్యానము ఇక్కడ చెప్పనక్కరలేదు. స్పష్టముగా నెంతవరకున్నదో అంతవరకే మనకు ఇక్కడ చాలును. బాప్తిస్మముపొందుటకు సమయములేక కొందరు చనిపోయినప్పుడు, బ్రతికియున్న బంధువులుగాని, స్నేహితులుగాని వారికి బదులుగా బాప్తిస్మముపొందుటయనే ఒక వాడుకను తెలుపుటకు ఈ వచనము తర్జుమా చేసినను చేయవచ్చును. లేక, చనిపోయిన క్రైస్తవుల బంధువులు వారు చివరి చెప్పిపోయిన మాటలనుబట్టి పిమ్మట క్రైస్తవమతము నవలంబించి, బాప్తిస్మము పొందినవారికి యీ వాక్యము చెందినను చెందవచ్చును. ఎలాగున్నను సరే. **బాప్తిస్మము సకలమైనవారికి అవశ్యముగానుండి తీరవలెనని ఆ కాలపువారు ఎంచిరనుటకు ఈ వచనము బలమయిన సాక్ష్యము.**

(xv) గలతి 3: 27. "క్రీస్తులోనికి బాప్తిస్మముపొందిన మీరందరు క్రీస్తును ధరించుకొన్నారు"

(1) పరి. పౌలు మొదటి ప్రయాణములో గలతియలో సభను స్థాపించెను. అపొస్తలుల కార్యములు 14-వ అధ్యాయములో ఈ చరిత్ర చెప్పబడియున్నది. బాప్తిస్మమునుగూర్చి పరి. లూకా ఆ చోట నేమియు చెప్పలేదు. కాని, గలతియలోని క్రైస్తవులందరును బాప్తిస్మముపొందిరని యీ వచనము వల్ల తెలియుచున్నది.

(2) బాప్తిస్మముపొందుట క్రీస్తును ధరించుకొనుటని అపొస్తలుడిచ్చోట వాదించుచున్నాడు. నీటిలోనుండి పైకివచ్చి, క్రొత్తవస్త్రములు ధరించుకొని, పాతబ్రతుకు విడిచిపెట్టుట క్రీస్తును ధరించుకొనుటకు గురుతని చెప్పుచున్నాడు.

(xvi) ఎఫెసీ 4: 5. "ప్రభువు ఒక్కడే, విశ్వాసమొక్కటే, బాప్తిస్మమొక్కటే."

క్రైస్తవులకందరికి ఒక్కటే బాప్తిస్మమున్నదట. అనగా యేసుక్రీస్తు నామమందు ఇయ్యబడు జలస్నానమే అందరిని ఒకటిగా నైక్యపరచు స్నానమని యీ వచనముయొక్క అర్థము.

(xvii) కొలొ. 2: 12. "బాప్తిస్మమందు మీరును ఆయనతోకూడ పాతిపెట్టబడిన "వారైతిరి."

(1) చిన్న ఆశియాలోని క్రైస్తవులును బాప్తిస్మముపొందియుండిరని దీనివల్ల తెలియుచున్నది.

(2) బాప్తిస్మముపొందిన ప్రతివారును దానివల్ల క్రీస్తుతోకూడ పాతిపెట్టబడినవారని చెప్పుచున్నాడు.

(3) పరి. పౌలుయొక్క మాటలు గమనించినట్టయితే, నీటిలో స్నానము చేయించి బాప్తిస్మమిచ్చుటే మనస్సులో నుంచుకొని దీనిని వ్రాసియుండెనని యనుకొనవలెను.

(xviii) తీతు 3· 5. "తన కనికరముచొప్పుననే నూతన జన్మసంబంధమైన స్నానముద్వా "రాను, పరిశుద్ధాత్మ మనకు నూతనస్వభావము కలుగచేయుటద్వారాను మనలను రక్షించెను."

(1) బాప్తిస్మము "నూతన జన్మసంబంధమైన స్నానమ"ని చెప్పుచున్నాడు. నూతనజన్మమునకు గురుతైన స్నానము, నూతనజన్మమును కలుగచేయు స్నానమని దీనికర్థము చేయవచ్చును.

(2) 'స్నానము' అను మాటలో తొట్టియను అర్థముకూడ చేయవచ్చును. నూతన జన్మసంబంధమైన స్నానము, లేక నూతన జన్మము కలుగజేయు బాప్తిస్మపు తొట్టియని దాని యర్థము.

(3) నూతన జన్మస్నానమనునది రక్షణకు దేవుడు వాడుకొను సాధనమని చెప్పబడుచున్నది. "నూతన జన్మసంబంధమైన స్నానముద్వారా మనలను రక్షించెన"ని అపొస్తలుడు చెప్పుచున్నాడు.

(xix) 1 పేతురు 3: 21. "ఆ నీళ్లకు సాదృశ్యమైన బాప్తిస్మమిప్పుడు మిమ్మును "రక్షించుచున్నది; బాప్తిస్మమనగా శరీరమాలిన్యము తీసివేయుట కాదుగాని యేసుక్రీస్తు పునరుత్థానమూల "ముగా దేవునివిషయమై నిర్మలమైన మనస్సాక్షి కలిగియుండుటకు ఊనుకొనుటే."

(1) నోవహు కుటుంబికులు జలప్రళయమునుండి ఓడలో కాపాడబడుట బాప్తిస్మమునకు సాదృశ్యముగా చెప్పబడుచున్నది.

(2) ఆ యోడలోనున్నవారిని జలప్రళయమందు కాపాడుటకు నీళ్లను శరీరరక్షణకు దేవుడు సాధనముగా నుపయోగించినట్టే, యిప్పుడు ఆత్మరక్షణను దయచేయు సాధనముగా బాప్తిస్మము నుపయోగించుచున్నాడని పరి. పేతురు చెప్పుచున్నాడు.

(3) బాప్తిస్మము రక్షించుచునను మాటలయొక్క అర్థమునుకూడా వివరించుచున్నాడు. బాప్తిస్మమనునది పాతనిబంధన సంబంధమైన కడుగుటవలె బాహ్యమైన శరీరమాలిన్యము తీసివేయుటకొరకైన యొక ఆచారముకాదు. దేవుని సముఖమందు నిర్మలమైన మనస్సాక్షి కలిగించు ఒక ఆచారమైయున్నది. తన పాపమును దేవుడు క్షమించియున్నాడని, తనతో తన్ను సమాధానపరచుకొనియున్నాడని ఒకడు నిశ్చయముగలవాడై ధైర్యము కలిగియుండుటకు సాధనమని చెప్పుచున్నాడు. క్రీస్తుయొక్క పునరుత్థానమూలముగా సంపాదింపబడిన రక్షణలో తనకు పాలున్నదనుటకు గురుతుగా అందరికి చూపుటకు అది దేవుని నియమమని దాని యర్థము. "దానిని పొందితిమని మనకు నిశ్చయము కలిగించు రుజువు" అనగా ఇదే.

పరిశుద్ధ బాప్తిస్మ సంబంధమందు నూతన నిబంధనలోనుండు వాక్యములన్నియు ఎత్తి చూపితిమి. వీటిలోనుండి పరి. బాప్తిస్మమునుగూర్చి అపొస్తలులకాలమందలి వాడుక యేమైనదిని, దానినిగూర్చి వారు బోధించిన యుపదేశమేమైనదిని మనము నేర్చుకొనదగినదంతయు ఇక నేర్చుకొందము

## 1. బాప్తిస్మ క్రమము.

### i. పరిశుద్ధ బాప్తిస్మము దేనితో నియ్యబడినది?

ఉదకముతోనే బాప్తిస్మమియ్యబడినదని పైన ఉదహరింపబడిన వాక్యములవల్ల ప్రత్యక్షముగా కనుబడుచున్నది. "నీళ్లకు ఆటంకము చేయగలడా!" (४) * అనునదిని, "ఇదిగో నీళ్లు, నాకు బాప్తిస్మమిచ్చుటకు ఆటంకమేమి?" అను మాటలు దీని నిరూపించుటకు చాలును.

### ii. బాప్తిస్మమిచ్చిన విధమేమి?

అధికముగా నీటిలో ముంచి బాప్తిస్మమియ్యబడెనని యూహింపవచ్చును. పరి. పౌలు దీనిలోనుండి బోధించిన బోధ (x) దీనికి ఆధారము. అయినను, ఎప్పుడును నీటిలో ముంచియే బాప్తిస్మమిచ్చిరని సాధించుటకు వీలు

* ఇలాగు గుర్తుగల అంకెలు పైన ఎత్తి వ్రాయబడిన వేదవాక్యములను సూచించును.

లేరు చెరసాల అధిపతి యింటిలో అర్ధరాత్రి వేళను, ఎరూషలేములోను, మంచి బాప్తిస్మమిచ్చు టసాధ్యము.

### iii. శిశువులకు బాప్తిస్మమిచ్చిరా?

పిల్లల బాప్తిస్మము విషయములో నిశ్చయముచెప్పుటకు రూఢియైన రుజావులేదు. ఒక ఇంటివారందరును బాప్తిస్మముపొందిన కుటుంబములలో పిల్లలు లేకుండెయుందురా! ఐనను, అలాగుండిరనుటకు సరియైన ఆధారము ఏమియులేదు. (vii అధ్యా. చూడుము.)

### iv. బాప్తిస్మమిచ్చినది యెవరు?

దీనినిగూర్చి అపొస్తలులకాలమందు ఏదైన నొక విధి యున్నట్టు కనుపించలేదు. కొరింథులో పరి. పౌలు తానే కొందరికిచ్చినట్టును, సమరయ్యలో ఏడుగురిలో నొకడైన పిలిప్పు ఇచ్చినట్టును, కొర్నేలి యింటిలోను, ఎఫెసులోను, అపొస్తలులతో నుండిన సహోదరులు ఇచ్చినట్టును, పరి. పౌలుకు శిష్యుడైన అననీయ ఇచ్చినట్టును, చెప్పియున్నది. గనుకనే పరి. సభలో ఏదో యొక ఉద్యోగముపొందినవారే బాప్తిస్మమియ్యవచ్చునన్న చట్టము అపొస్తలులకాలమందు లేదని రూఢి చేయవచ్చును.

### v. బాప్తిస్మమందు వాడబడిన మాటలేవి?

అపొస్తలులకాలమందు దీని విషయమై ఖండితమైన ప్రమాణముండెనా యని సందేహము మత్తయి 28: 20. తప్ప బాప్తిస్మసంబంధమందు త్రియేక దేవుని నామము వేరే యెక్కడను చెప్పబడలేదు "యేసుక్రీస్తు నామమందు" అనునదే యెప్పుడును వాడబడిన పదము. అయినను, బాప్తిస్మము ఇయ్యబడిన క్రమము ఈ మాటలు వివరింపక, యీ బాప్తిస్మముయొక్క స్వభావము నే తెలుపుచున్నట్లు చెప్పవచ్చును. ఏలాగైనను పరి. మత్తయి సువార్త ప్రచురమైనపిమ్మట త్రియేక దేవుని నామమే చెప్పబడియుండవచ్చునని సందేహములేకుండా చెప్పవచ్చును. యేసుక్రీస్తు నామము ఉచ్చరింపబడుటయే ముఖ్యమైన సంగతిగా ఆరంభమందు ఎంచబడియుండవచ్చును. యేసునాధుని నామమున బాప్తిస్మముపొందినవాడు ఆయనవాడనై యుందునని ప్రమాణము చేసినవాడని చెప్పబడెను. (1 కొరి. 1: 14)

పరిశుద్ధ బాప్తిస్మమునుగూర్చి అపొస్తలులు బోధించిన యుపదేశము ఏమి యని ఇక విచారింతము.

## 2. బాప్తిస్మమునుగూర్చిన ఉపదేశము.

**1. పరి. బాప్తిస్మమనునది తప్పకుండ కావలసినదని అపొస్తలుల కాలమందు ఎంచబడినట్లు తెలియుచున్నది.**

బాప్తిస్మముపొందినను ఒకటే, పొందకపోయినను ఒకటేనని అపొస్తలులకాలమందు ఎవరును ఎప్పుడును ఎంచలేదు. పరి. బాప్తిస్మముపొందని వాని నెవనినైనను విశ్వాసియనిగాని, క్రైస్తవుడనిగాని, సభలో చేరినవాడనిగాని అపొస్తలులు ఎంచినట్లు చెప్పుటకు కించిత్తైనను హేతువులేదు.

దైవదర్శనమువల్ల గుణపడిన సౌలునను, బహుదూరము ప్రయాణమై పోవుచున్న ఐతియోపియా మంత్రికిని, పరిశుద్ధాత్మను పొందిన కొర్నేలి యింటివారికిని, అర్ధరాత్రివేళ గుణపడిన చెరసాల అధిపతికిని, స్నానికుడైన యోహాను స్నానముపొందిన ఎఫెసీయులకుకూడ — పరిశుద్ధ సభయొక్క బాప్తిస్మము అవశ్యమని అపొస్తలులు ఎంచిరి. గలతియలోను, మకెదోనియలోను, అఖాయలోను, ఆశియాలోను, ఇతాలియాలోను,—పరి. పౌలైనను సరే, పరి. పేతురైనను సరే,—బాప్తిస్మముపొందినవారెవరో వారినే క్రైస్తవులని యెంచిరి. "విశ్వాసులు," "క్రీస్తుకు లోబడినవారు," "పరిశుద్ధులు" అను పేర్లు బాప్తిస్మము పొందినవారికేగాని మరి యెవరికి నియ్యబడలేదు. రక్షింపబడుటకు నేనేమి చేయవలెను అని యెవరైనను అడిగినప్పుడు, పశ్చాత్తాపమును విశ్వాసమును అవశ్యమని యెంత ఖండితముగా ప్రసంగించిరో, అంత ఖండితముగానే బాప్తిస్మమును అవశ్యమని బోధించుట అభ్యసించిరని ప్రత్యక్షముగా చూచుచున్నాము. ఒకడు బాప్తిస్మముపొందనియెడల, వాడు క్రైస్తవుడనికాని, క్రీస్తు శరీరములో చేర్చబడినవాడనిగాని, క్రీస్తు మరణములో పాలుపొందినవాడనిగాని, చెప్పియుండిరని యెరుగుదుము. పరిశుద్ధసభ ఆరంభించినతరువాత దీనికి భిన్నమైన మార్గములేదు.

**2. పరిశుద్ధ బాప్తిస్మము క్రైస్తవుని లోపలి ఆత్మీయమైన స్థితిని తగినట్టుగా దృష్టాంతపరచునట్టి విలువగల గురుతైనట్లు అపొస్తలులు ఎంచినట్లు కనుపించుచున్నది.**

(a) బాప్తిస్మమందు నీటిలో మునుగుట పాతిబ్రతుకునకు చనిపోయి, పాతిపెట్టబడుటకు గురుతని పరి. పౌలు రోమీయులకు వ్రాయుచున్నాడు (x).

నీటిలోనుండి పైకివచ్చుట దేవునికొరకు జీవించుటకు నూతనబ్రతుకులో ప్రవేశించుటకు సమానమని ఆ చోటనే ముఖ్యముగా చూపుచున్నాడు. గనుకనే, బాప్తిస్మమునకు 'మరణమునకు లోపరచు స్నానమను' నామధేయము ఇచ్చుచున్నాడు. పాపమునకు చనిపోయి మనము ఇక దానిలో నేలాగు జీవింపగలమని బాప్తిస్మపు గురుతునుబట్టి ప్రశ్నించుచున్నాడు.

(*b*) మరియు, నీటిలోనుండి పైకివచ్చి క్రొత్త వస్త్రములు ధరించుకొనుట, క్రీస్తును ధరించుకొనుటకు గురుతని పరి. పౌలు గలతీయులకు వ్రాయుచున్నాడు (xv). నూతనవస్త్రములు ధరించుకొనిన తరువాత తిరిగి పాతబట్టలు ధరించుకొనుట యెంత అసహ్యమో, క్రీస్తును ధరించుకొనినవారు ధర్మశాస్త్ర సంబంధమైన ఆచారములకు పోవుటయు అంత అసహ్యమైన కార్యమైనట్టు చెప్పుచున్నాడు.

(*c*) ఉదకస్నానమువల్ల శరీరము కడుగబడి శుభ్రపరచబడుట, రక్షకుని యొక్క పుణ్యము చేత పాపముపోవునట్లు కడుగబడుటకు గురుతని అనేక చోట్ల చెప్పబడినది. కొరింథీయులను చూచి: "కాని ప్రభువైన యేసుక్రీస్తు నామమునను మన దేవుని ఆత్మయందును మీరు కడుగబడి, పరిశుద్ధపరచబడిన వారై నీతిమంతులుగా తీర్చబడితిరి" (1 కొరిం. 6: 11.) అని చెప్పినప్పుడు వారు పొందిన బాప్తిస్మమునే గురుతుగా నుంచుకొని మాట్లాడుచున్నాడు. క్రీస్తుకూడా సభను, "ఉదకస్నానముచేత పవిత్రపరచెన"ని (ఎఫెసీ. 5: 26). ఎఫెసీయులకు వ్రాయునపుడు బాప్తిస్మమునే దృష్టాంతముగా తీసికొని వ్రాసెననుటకు సందేహము లేదు.

### (*d*) నీటితొట్టిలో మునిగి పైకివచ్చుట నూతన జన్మమునకు గురుతని పరి. పౌలు తీతునకు వ్రాసెను. (xviii.)

"నూతన జన్మసంబంధమైన స్నానము" అను పదము దీనిని స్పష్టముగా వివరించును. బాప్తిస్మముపొందిన ఒక అన్యుడు, నీటిలోనుండి బయటికి వచ్చినప్పుడు, యూదుడుగా పైకివచ్చినట్టు ఏలాగు ఎంచబడెనో, అలాగే పరిశుద్ధ బాప్తిస్మముపొందినవాడును నీటిలోనుండి బయటికి వచ్చినప్పుడు, నూతన జన్మము పొందినవాడని యెంచబడినట్టు చూచుచున్నాము. "ఒకడు నీటి మూలముగాను, ఆత్మమూలముగాను జన్మించితేనే గాని" అని యేసునాధుడు నికొదేముకు చెప్పిన వాక్యములోకూడ నిదే గురుతుగా కనపరచబడియున్నది.

నీటిలో మునిగి లేచుట నీటిమూలముగా జన్మించుటని చెప్పబడుచున్నది. నూతనజన్మమునకు పోల్చుటకిది మంచి ఉపమానము.

(e) ఒక్క నామమందు ఒక్క విశ్వాసమును ఒప్పుకొనినందున బాప్తిస్మముపొందెడువారు ఒక్క శరీరమైయున్నారని బోధింపబడెను (xiii). "శరీరమొక్కటే, ఆత్మయు నొక్కడే, ప్రభువు ఒక్కడే, విశ్వాసమొక్కటే, బాప్తిస్మమొక్కటే."

"బాప్తిస్మమొక్కటే" అనగా, పెంతెకొస్తుదినము మొదలు యేసుక్రీస్తు దినమువరకు క్రీస్తు సభలో చేరువారందరు పొందు స్నానము. దీనిని పొందు వారందరును ఒకే సార్వత్రికమును అపొస్తలికమునైన పరిశుద్ధసభలో అవయవములగుదురు. ఈలాగు బాప్తిస్మముపొందినవారు కక్షలుచేయుట పాపమని అపొస్తలుడు కొరింథీయులకు వ్రాయుచున్నాడు (iii). పౌలు, అపొల్లొ అను వారు పేరుపెట్టినను సరే, వెస్లీ, లూథరు అనువారు పేరుపెట్టినను సరే, సేవకుల పేళ్లతో కక్షలకు పేళ్లుపెట్టువారిని చూచి అపొస్తలుడు: "మీరు వీరి నామమున బాప్తిస్మముపొందితిరా?" అని అడుగుట న్యాయమే. "బాప్తిస్మమొక్కటే—సభయు ఒక్కటే."

**3. బాప్తిస్మము లోపలి ఆత్మీయమైన కృపావరములను వయ చేయునట్టి పరిశుద్ధ కృపాసాధనమని అపొస్తలులు ఎంచినట్టు కనబడుచున్నది.**

మూడుమాత్రమే యిక్కడ చెప్పితే చాలును.

(a) **పాపక్షమ పొందుటకు** బాప్తిస్మము సాధనమయినట్టు ఎంచబడెను.

పరి. పేతురు పెంతెకొస్తుదినమందు "మీరు మారుమనస్సుపొంది పాపక్షమాపణ నిమిత్తము బాప్తిస్మముపొందుడి" అని చెప్పెను (i). అనబీయ పరి. పౌలుతో నాలాగే యనినట్లు చదువుచున్నాము (iii). మార్గమందు, "నేనేమిచేయుట నీ చిత్తమని యడిగినప్పుడు కాదు, మూడు దినములు ఉపవాసముచేసి, ప్రార్థించినప్పుడును కాదు, కాని బాప్తిస్మముపొందినప్పుడే సౌలు పాపక్షమాపణపొంది పాపములనుండి కడుగబడెనని అననీయ మాటలవల్ల గ్రహించుచున్నాము." మారుమనస్సు, విశ్వాసము, తన్ను ప్రతిష్ఠించు

కొనుట, అనునవి మనుష్యులలో కనబడవలసినది యవశ్యమైనను, పాపమునుండి కడుగబడుటయు, ఆత్మీయజీవము అనుగ్రహింపబడుటయు బాప్తిస్మమందే.

(*b*) **ఆత్మీయమైన నూతనజన్మము పొందుటకు** బాప్తిస్మము సాధన మని యెంచబడెను.

బాప్తిస్మమునకు "నూతన జన్మసంబంధమైన స్నానము"ను నామధేయము ఇయ్యబడుచున్నది. జననము ఏలాగు దేవుని క్రియయో, ఆలాగే నూతన జన్మము దైవసంబంధమైన క్రియయే. మారుమనస్సు నూతనజన్మము కాగ; నడత మారుట నూతనజన్మము కాదు, విశ్వాసము నూతనజన్మము కాదు,—క్రీస్తు జీవము ఆత్మవల్ల మన హృదయములో నాటబడుటే నూతనజన్మము. ఈ క్రియ బాప్తిస్మకాలమందే జరుగునని నూతన నిబంధన చెప్పుచున్నది. నీటిమూలము గాను, ఆత్మమూలముగాను జన్మించుటే నూతనజన్మము. దీనిని అనుగ్రహించు వాడు పరిశుద్ధాత్మ దేవుడు. బాప్తిస్మముపొందినవారు దైవాత్మకు ఆలయములై యున్నారనియు, వారు దేవుని పిల్లలని ఆ యాత్మ సాక్ష్యమిచ్చుననియు చెప్పి యున్నది.

(*c*) క్రీస్తుయొక్క మర్మశరీరమందు **అవయవములగుటకును** ఇది సాధనమైనట్టు ఎంచబడినది.

బాప్తిస్మముపొందినవాడు **క్రీస్తును** ధరించినవాడనియు, **ఆయన యొక్క** అవయవమనియు అనిపించుకొనుచున్నాడు. **ఈలాగు** ఆయనతో అంటుకట్టబడిన యెడల, ఆయన మరణమందును, భూస్థాపనయందును, పునరుత్థానమందును ఆయనతో సంబంధముగలవాడని చెప్పబడినది. ఈ విధమైన ఆత్మీయసంబంధము బాప్తిస్మకాలమందు జరిగి తీరినట్టు పరి. పౌలు ఎప్పుడును చెప్పుచుండును.

ఇత్యాది కారణములచేత బాప్తిస్మము ఒక సంస్కారమనుచున్నాము. లోపలి ఆత్మీయమైన కృపావరములకు వెలుపలి గురుతులనియు, ఇవి ఆ కృపలను పొందుటకు సాధనముగాను వాటిని పొందితిమని నిశ్చయము కలుగ జేయు ఆనవాళ్లుగాను ఉండుటకు క్రీస్తు తానే నిర్ణయించినవేవో వాటికే 'సంస్కారములు' అను పేరు ఇంగ్లాండుసభ యిచ్చియున్నది. దీనినిగూర్చి సవిస్తరముగ తరువాతి అధ్యాయములో విచారింతము.

# 3-వ అధ్యాయము.

## సంస్కారము.

పరిశుద్ధ బాప్తిస్మము ఒక సంస్కారమనుచున్నాము. సంస్కారమనునది పరిశుద్ధసభలో అనేక అర్థములతో వాడబడిన పదము. తెనుగులో సంస్కారమని తర్జుమాచేయబడిన పదమునకు లాటిన్ భాషలో సాక్రమెంటు అని యున్నది. ఈ సాక్రమెంటు అను పదము అనేక అర్థములతో పరిశుద్ధసభలో వాడబడినది. ఈ పదముయొక్క పూర్వోత్తర చరిత్రయును, ప్రస్తుతోపయోగమును ఈ యధ్యాయమందు నేర్చుకొందము.

### (1) సాక్రమెంటు అను పదముయొక్క చరిత్రయేమి?

#### i. ప్రత్యేకపరచబడిన సంచకరువు.

**సాక్రమెంటు** అను లాటీనుపదము "ప్రతిష్ఠించు" అను అర్థముగల "సాక్రారె" అను పదమునుండి వచ్చినది. గనుకనే సాక్రమెంటు అను పదమునకు ప్రతిష్ఠింపబడిన, లేక ప్రత్యేకపరచబడిన వస్తువు అని అర్థము. ఇద్దరు మనుష్యులు ఒక ప్రమాణముచేసికొనుటకు వచ్చినప్పుడు తమ సత్యమునకు సాక్ష్యముగ ప్రత్యేకపరచి సంచకరువుగా నియ్యబడు సొమ్మునకు పూర్వకాలమందు 'సాక్రమెంటు' అను పేరు వాడిరి.

#### ii. ప్రత్యేకపరచు వాక్కు లేక ఆచారము.

కాలక్రమమున ఒకనిని ఏ యుద్యోగమునకైనను ప్రత్యేకించి నియమించునప్పుడు వాడిచ్చునట్టి వాగ్దత్తమునకు 'సాక్రమెంటు' అను పేరు వచ్చెను. ఈ కారణములచేతనే రోమనుభటులు తమ పేళ్లు పటాలములో వ్రాయించుకొనునప్పుడు చేయు రాజభక్తి ప్రమాణమును 'సాక్రమెంటు' అనిరి. అటుపిమ్మట నమ్మకమునకు గురుతుగాచేయబడు ఎట్టి ప్రమాణమునయినను 'సాక్రమెంటు' అని చెప్పినట్లు తోచుచున్నది. చిన్న ప్లినీ ట్రేజన్ చక్రవర్తికి క్రైస్తవులనుగూర్చి వ్రాసిన యుత్తరములోనే క్రీస్తుమత సంబంధమందు ఈ పదము మొట్టమొదట వాడబడినది. "ఈ క్రైస్తవులు నియమింపబడిన యొక దినమందు అరుణోదయము కాకముందు ఏకముగకూడి దేవుని స్తుతించినట్లు, 'క్రీస్తు అను నాయనకు స్తోత్రగీతములు పాడి, యేవిధమైన అక్రమములు

"చేయమని ఒక సాక్రమెంటుచేత శపథముచేసికొందురు" అని వ్రాసెను. 'సాక్రమెంటు' అను పదము అతడు క్రైస్తవులయొద్ద విని యీ విధముగ వ్రాసెనో, లేక మతసంబంధమైన 'ప్రమాణము' అను అర్థముతో వ్రాసెనో—స్పష్టముగ చెప్పుటకు వీలులేదు. ఇదెట్లున్నను సరియే. సుమారు క్రీ. శ. 200 నుండి టర్టలియను తన యనేక గ్రంథములలో రాణువవారుచేయు ప్రమాణమునుగూర్చిన యీ పదమును బాప్తిస్మ ప్రతిజ్ఞకు ఉపయోగించెను.[1] "సాక్రమెంటు మాటలను మేము ఉచ్చరించినప్పుడు, జీవముగల దేవుని పక్షమందు నిలువబడి యుద్ధముచేయుటకు మేము పిలువబడితిమి" అనియు, విగ్రహములను చేయుట తప్పితమని వ్రాసినచోట: "ఈ విధమైన వృత్తి మన విశ్వాసమునకు విరోధమని మన సాక్రమెంటులే మనకు తెలుపుటలేదా? వీటిని చేసిన యెడల సాతానును, వాని దూతలను మనము విసర్జించి రోసివేయుటెట్లు?" అనియు, అన్యుల వేడుకలను చూచువాడు బాప్తిస్మ సాక్రమెంటును నిర్లక్ష్యము చేసినవాడనియు చెప్పుచున్నాడు ఈ సందర్భములో పరిశుద్ధ బాప్తిస్మ ప్రతిజ్ఞకు బదులుగా నీ పదమును వాడినట్లు తెలియుచున్నది. మరియు బాప్తిస్మము పొందువారు దానిని పొందునప్పుడు తమ విశ్వాసమును ఒప్పుకొందురు గనుక ఆ విశ్వాసమాత్రమునకు సాక్రమెంటు అను పేరు ఇచ్చినదని తోచుచున్నది.

మరియు, పరిశుద్ధమైన ప్రమాణము అను అర్థముతో వాడబడిన యీ పదము, పరిశుద్ధమైన యాచారము అను అర్థముతో నుపయోగింపబడినట్లు తెలియుచున్నది. టర్టలియను ఈ యర్థముతో నీ పదమును అనేకచోట్ల నుపయోగించెను. బాప్తిస్మమునుగూర్చిన గ్రంథమందు అది "జలసాక్రమెంటు" అని యనుచున్నాడు. మరియొకచోట రొట్టెపాత్రయను సాక్రమెంటని పరిశుద్ధ సమభాక్ష్యమునుగూర్చి చెప్పెను.[2] సాక్రమెంటుగా శిశువులను చంపి తిందుమని చెప్పుదురని యొకచోట వ్రాయుచున్నాడు.[3] పరి. కుప్రియను కూడా యీ విధముగానే అనేక అర్థములతో ఈ పదము నుపయోగించెను.

### iii. దైవరహస్యము.

కాలక్రమమున మరియొక ఉపయోగము ఈ పదమునకు వచ్చెను. గ్రీకుభాషలో "మిస్తేరియోన్" (రహస్యము) అను పదము "సాక్రమెంటు" అని లాటిన్ పదముగా భాషాంతరము చేయబడినది. గనుక నే

[1] Ad. Martyras 3; On Idolatry 6. [2] Against Marcion 5, 8.
[3] Apologeticus 7.

సహజముగా మర్మమైనసంగతిని, సువార్తమూలముగ భక్తులకు బయలుపరచ బడినట్టి లోతైన యుపదేశములకు "సాక్రమెంటు" అను పేరు పెట్టబడినది. ఈ విధముగ త్రిత్వమునుగూర్చిన రహస్యము, మనుష్యావతార రహస్యము, రక్షకుని శ్రమలు, మరణమునుగూర్చిన మర్మములు—అనునవే లాటినులో త్రిత్వ "సాక్రమెంటు," మనుష్యావతార సాక్రమెంటు అని చెప్పబడినది. సిప్రియను తన పత్రికలలో పస్కాను, విశ్వాసమూత్రమును, సత్యవేద ఉపదేశమునుగూర్చి "సాక్రమెంటు" అని చెప్పుచున్నాడు.[1] ప్రభువు ప్రార్థనయు అనేక ఉన్నత సాక్రమెంటులు కలిగియున్నదని ఒకచోట చెప్పుచున్నాడు.[2]

పైన చెప్పినదంతయు క్లుప్తముగా చెప్పినయెడల ఈ పదము మూడు అర్థములతో నుపయోగించబడినదని తెలిసికొనుచున్నాము.

(i) మూలార్థప్రకారము ప్రతిష్ఠింపబడిన వస్తువులు సాక్రమెంటులుగ నెంచబడెను. ఉదాహరణము: తైలాభిషేకపు నూనె, బాప్తిస్మమియ్యబడిన పాలు, తేనె, ప్రతిష్ఠింపబడిన బూడిద మొదలైనవి. (ii) ప్రతిష్ఠించుటకు ఉచ్చరించునట్టి మాటలును, చేయబడు ఆచారములును సాక్రమెంటులన బడెను. ఉదాహరణము: రాజభక్తి ప్రతిజ్ఞ, బాప్తిస్మము, విశ్వాసమూత్రము మొదలైనవి. (iii) నూతన నిబంధనలో బయలుపరచబడిన రహస్యమైన దివ్యోపదేశములకు ఈ పేరు కలిగెను.

రాగా రాగా పైనచెప్పబడిన మూటికిని చెల్లతగిన యాచారములెవ్వియో వాటికిమాత్రము సాక్రమెంటను పేరు ఉపయోగించబడెను.

## (2) సాక్రమెంటులు లేక సంస్కారములు ఎన్ని?

పైనచెప్పబడిన యీ మాటయొక్క చరిత్రనుబట్టి రెండు సంగతులు స్పష్టమగుచున్నవి. **సామాన్యమైన** మూలార్థప్రకారము సాక్రమెంటు లని పిలువబడినవాటికి లెక్కలేదు. అంతరార్థముకలిగిన యే బాహ్యచిహ్న మైనను సాక్రమెంటే. ఆ చిహ్నము ఒక యాచారమైనను సరియే, ఉప దేశమైనను సరియే, నియమమైనను సరియే—అన్నియు సాక్రమెంటులే.

విశేషార్థప్రకారము సాక్రమెంటుల లెక్క కొద్ది. ఆత్మీయమైన లోపలి కృపను అనుగ్రహించు వెలుపలి యాచారనియమములు కొన్ని మాత్రమే యున్నవి.

[1] Letters 73, 74. [2] On the Lord's Prayer 9.

## (3) క్రీస్తుసభయొక్క సాక్రమెంటులు ఎన్ని?

క్రీస్తుమతముయొక్క సాక్రమెంటులు కొద్దియైనయెడల, అవి లెక్కకు ఎన్ని? ఈ ప్రశ్నకు అనేకులు అనేకవిధములుగ ప్రత్యుత్తరమిచ్చిరి. బాప్తిస్మము, ప్రభువు రాత్రిభోజనము ఇవి రెండును ముఖ్యమైన సాక్రమెంటులని అందరును ఒప్పుకొందురు. కాని వీటితో నింకను కొన్నింటిని చేర్చి, మూడు, ఐదు, ఏడు, పండ్రెండు, ముప్పది సాక్రమెంటులున్నవని చెప్పినవారునున్నారు. పెర్గెము అధ్యక్షుడైన గ్రెగోరీ అనునాయన పండ్రెండవ శతాబ్దములో సాక్రమెంటులు **ఏడు** అని లెక్కచెప్పుట మొట్టమొదట ఆరంభించెను. దాని తరువాత కొన్ని సంవత్సరములపిమ్మట, పీటరు లాంబార్డు అనునాయన **ఏడు** అను లెక్కను బలముగా తన పుస్తకములలో స్థాపించెను. చివరకు త్రెంటుసభలో ఇది రోమాను సభయొక్క సిద్ధాంతముగా చేసిరి. ఆ సంఘముయొక్క చట్టములలో నొకదానియందు: "నూతన నిబంధనయొక్క సాక్రమెంటులన్నియు మన ప్రభువైన యేసుక్రీస్తువల్ల ఏర్పరచబడలేదని యైనను, లేక అవి బాప్తిస్మము, నిర్ధారణ, ప్రభువు రాత్రిభోజనము, ప్రాయశ్చిత్తము, అవసానాభిషేకము, గురునిర్ణయము, వివాహము అని యేడుకాక ఎక్కువ, లేక తక్కువయున్నవనిగాని, లేక యీ యేడింటిలో నేదోయొకటి సరిగాను నిశ్చయముగాను సాక్రమెంటు కాదనిగాని, యెవడైనను చెప్పిన యెడల వాడు శపించబడినవాడు." అని కనిపించుచున్నది.

పరి. బాప్తిస్మము, పరి. ప్రభువు రాత్రిభోజనము అను రెంటితో చేర్చబడియున్నయైదును ఎందుచేత సాక్రమెంటులుగా ఎంచబడెనో మనము సులభముగా ఊహించవచ్చును. **నిర్ధారణలో** చేతులుంచుట బాహ్యపు గురుతు. పరిశుద్ధాత్మశక్తి లోపలి కృప. **ప్రాయశ్చిత్తములో** ప్రకటించబడు పాపవిమోచనక్రమము బాహ్యపు క్రియ; పాపక్షమ లోపలి కృప. **అవసానాభిషేకములో** నూనె రాయుట బాహ్యపుక్రియ; శరీరసుఖము దానివల్ల కలుగు ఆశీర్వాదము. **గురునిర్ణయములో** చేతులుంచుట బాహ్యపు గురుతు; ఉద్యోగాధికారమును, కృపయు దానివల్ల కలుగు ఆత్మీయాశీర్వాదము. **వివాహములో**, పురుషుడును, స్త్రీయును ఒకరితో నొకరు చేయు ఒడంబడిక బాహ్యపు క్రియ; వారిద్దరును ఒకే శరీరముగా చేయబడి వివాహసంబంధము యొక్క ఐకమత్యతయు ప్రేమయు కలిగియుండుటే దానివల్ల కలుగు ఫలము. కనుకనే, మనము పైనచెప్పిన సామాన్యార్థప్రకారము ఇవి యొక

విధముగ సాక్రమెంటులని చెప్పినందువల్ల తప్పితములేదు. కాని యీ విధము గానే యింకను అనేక యితరమైనవాటిని ఇదే యర్థమందు సాక్రమెంటులని చెప్పవచ్చునని ఆలోచించుకొనవచ్చును. ఈ విధముగ నాలోచించినయెడల, పూర్వికులు కొందరు చెప్పినట్టు మోకరించుట, శిలువ గురుతువేయుట మొదలైన భక్తినిచూపు ఆచారములు మొదలైనవిమాత్రమేకాదు, వేదపారాయణముచేయుట, ప్రార్థించుట, ప్రసంగించుట మొదలైన మతసంబంధమైన కార్యములన్నియు సాక్రమెంటులనదగును.

అయినను, లోపలి కృపలను దయచేయు సాధనములుగా క్రీస్తునాథుడు ఏయే బాహ్యపుక్రియలను నియమించెనో వాటికిని యితరమైనవాటికిని అనంతమైన భేదమున్నది. యేసునాథునివల్ల నియమింపబడినవి సకలమైనవారికిని తప్పకుండ అవశ్యమైనవని మనము ఒప్పుకొనవలెను. వాటిని విసర్జించుట దోషమగును; లోపలి కృపలను అన్ని కాలములయందును, అన్ని సమయములందును భక్తులకు దయచేయబడిన సాధనములని వాటినిగూర్చియే సాధింపతగును.

మతదిద్దుబాటు చేసినవారి బోధకూడ నిదే. సాక్రమెంటు అను సామాన్యార్థముగల పదమును వారు ఉపయోగింపవలసివచ్చినను, 'సువార్త సాక్రమెంటులు,' 'క్రీస్తువల్ల నియమింపబడిన సాక్రమెంటులు' అని వాటి లక్షణములచేత ఆ పదముయొక్క అర్థమును హద్దుపరచిరి. లూథరన్ ఒప్పుకోలులో, ఏడవదానిలో: "ప్రభువువల్ల నేర్పింపబడినదని, ఆయన కృపతో చేసిన వాగ్దత్తముతో కూడినదనియైన వెలుపలి గురుతులు ఆచారములుమాత్రమే సాక్రమెంటులు"ని చెప్పబడియున్నది.[1] ఆంగ్లేయసభయొక్క ప్రశ్నోత్తర బోధినిలో: "మనకు ఇయ్యబడుచున్న ఆత్మీయమైన లోపలి కృపకు కనబడు వెలపలిగురుతు అనియు ఇది ఆ కృపను పొందుటకు సాధనముగాను దాని పొందితిమని నిశ్చయము కలుగజేయు అనవాలుగాను ఉండుటకు క్రీస్తు తానే నిర్ణయించెననియు సంస్కారమనెడు (సాక్రమెంటు) మాటకు అర్థమని బోధించుచున్నది." 25-వ మతాంశములో: "సువార్తలో మన ప్రభువైన క్రీస్తు నిర్ణయించిన సంస్కారములు రెండు కలవు. అవి ఏవనగా బాప్తిస్మమును ప్రభువు రాత్రిభోజనమును అయియున్నవి. నిర్ధారణ ప్రాయశ్చిత్తము గురు నిర్ణయవివాహ అవసానాభిషేకములని సాధారణముగా చెప్పబడుచున్న ఈ యైదును సువార్త సంస్కారములని ఎంచబడకూడదు. ఎందుకంటే ఇవి

[1] Zehme. సత్యవిజ్ఞానకోశ. 538 పేజ

కొంతమట్టుకు అపొస్తలులను తప్పుగా అనుసరించుటవల్ల కలిగినవిగాను (ఇది ప్రాయశ్చిత్తము, అవసానాభిషేకములకు చెందును) కొంతమట్టుకు లేఖనములలో చెప్పిన జీవితావస్థలుగాను ఉన్నవేగాని (ఇది వివాహము, గురునిర్ణయములకు చెందును) దేవుని నిర్ణీతమైన బాహ్యచిహ్నముగాని ఆచారముగాని వీటికి కలిగియుండలేదు, (ఇది నిర్ధారణకు చెందును.) బాప్తిస్మమునకును ప్రభువు రాత్రిభోజనమునకును కలిగియున్నట్టు వీటికి సంస్కారములయొక్క స్వభావచిహ్నములు లేవు," అని కనిపించుచున్నది. ఈ ప్రమాణముచొప్పున పరీక్షించితే, నిర్ధారణ క్రీస్తునాధునివల్ల నియమింపబడినదని చెప్ప వీలులేదు. **ప్రాయశ్చిత్తము,** రక్షకునివల్ల ఏర్పరచబడినదని చెప్పతగినదైనను (పరి. యోహాను 20: 23), ఆయనచేత నేర్పరచబడిన బాహ్యచిహ్నముగలదికాదు. **గురునిర్ణయము,** రక్షకునివల్ల నియమింపబడినదని చెప్పతగినదైనను (యోహాను 20: 21—23), చేతులుంచుటయను బాహ్యచిహ్నము ఆయనవల్ల ఏర్పరచబడినదని చెప్పుటకు హేతువులేదు. **వివాహము, అవసానాభిషేకము** — యేసునాధునివల్ల ఏర్పరచబడినవికావు. గనుక ఈ యైదున్ను సువార్త సాక్రమెంటులుకావని చెప్పుట న్యాయమే. హోమిలీ ప్రసంగములో నున్నట్టు, "నూతననిబంధనలో స్పష్టముగ ఆజ్ఞాపింపబడిన ఉచితముగ దయచేయబడు పాపక్షమయు, పరిశుద్ధతయు, క్రీస్తులో నైక్యమును దయచేయు వాగ్దత్తము చేర్చబడినట్టు కనుపించు చిహ్నములే" సువార్త (సాక్రమెంటులు) సంస్కారములని యెంచతగునని చెప్పుచున్నది. ఇటువంటివి పరిశుద్ధ బాప్తిస్మము, పరిశుద్ధ ప్రభువు రాత్రిభోజనము అని రెండే.

సువార్త సాక్రమెంటులు (సంస్కారములు) రెండని పైన చెప్పితిమి. ఈ రెంటియొక్క గుణాతిశయములెవ్వియో ఇక విచారింతము.

## (4) సువార్త సాక్రమెంటుల స్వభావమేమి?

దీనినిగూర్చి ఆంగ్లేయసభయొక్క బోధ మతాంశములలోను, ప్రశ్నోత్తర బోధినిలోను కనుపించును.

"క్రీస్తు నిర్ణయించిన సంస్కారములు క్రైస్తవమతమునకు గురుతులు అయియుండుటయేగాక కృపకును దేవునను గ్రహమునకును నిశ్చయమైన సాక్ష్యములును సఫలమైన సూచికములును అయియున్నవి. వీటివల్ల ఆయన మన అంతర్యములలో గూఢముగా క్రియను నడిపి, తనయందలి విశ్వాసమును ఉత్పత్తిచేయుటయేగాక దానిని బలపరచి స్థిరపరచుచున్నాడు." 25 మతాంశము.

"మనకు ఇయ్యబడుచున్న ఆత్మీయమైన లోపలి కృపకు కనబడు వెలపలి గురుతనియు ఇది ఆ కృపను పొందుటకు సాధనముగాను దాని పొందితిమని నిశ్చయము కలుగజేయు ఆనవాలుగాను ఉండుటకు క్రీస్తు తానే నిర్ణయించిన నియమమే సాక్రమెంటు (సంస్కారము)" ప్రశ్నోత్తరబోధిని.

వీటిలో బోధింపబడిన ఉపదేశమును ప్రత్యేకముగా విచారింతము.

## (1) సంస్కారములు క్రీస్తుమతమును అవలంబించుటకు గురుతులు.

సంస్కారములను అశ్రద్ధచేయువాడు క్రీస్తుమతము ననుసరించువాడని చెప్పుటకు వీలులేదు. ఒక అన్యునికి, క్రైస్తవునికి భేదము చూపునది సంస్కారములే.

బాహ్యమైన యొక సభను క్రీస్తునాథుడు ఈ లోకమందు స్థాపించిన మాట నిజమైతే, దానిలో చేరుటకును, దాని యైక్యములో నిలిచియుండుటకును వెలపలి గురుతులు అవశ్యమన్నమాట స్పష్టమే.

మరియు, కులకట్టుబాటులుగల యీ దేశములో ఈ హేతువు సులభముగా తెలియును. ఒకడు మనస్సులో నెటువంటి విశ్వాసముగలవాడైనను, వెలపలి బాప్తిస్మము పొందకున్నయెడల, వానిని క్రైస్తవుడని హిందువులనరు. బాప్తిస్మమే క్రైస్తవుడన్న పేరు ఒకనికిచ్చును; పాత సంబంధములనుండి, కులమునుండి అతని వేరుపరచును; క్రైస్తవులతో నతని యైక్యపరచును. "వంకరైన యీ తరమువారికి వేరై మిమ్మును మీరు రక్షించుకొనుడి" అని చెప్పబడిన యాజ్ఞకు బాప్తిస్మముపొందనివాడు ఈ దేశములో నెట్లు లోబడును?

కాని, సంస్కారములు ఉత్తగురుతులని, క్రైస్తవమతమును అనుసరించుటకు ఉత్తసూచికములనిమాత్రము చెప్పుట తప్పని మతాంశములు చెప్పుచున్నవి. జువింగిలియనులును, ప్రస్తుతకాలమందు ఆయా స్వతంత్రసభలలో చేరినవారును ఈ విధమైన అభిప్రాయమును స్థాపించుదురు. సాక్రమెంటులు ఏదో యొక లోపలి కృపను దయచేయు కృపాసాధనములని వారు ఒప్పుకొనుటలేదు. "సాక్రమెంటు అనునది ఒక వెలపలి గురుతు; ఒక దేశపు దుస్తులైనను చిహ్నములైనను ధరించుకొనినవానిని ఫలాని దేశపువాడని దానినిబట్టి బాగుగ తెలిసికొనునట్లు, మనము ఫలానివారమనియు, మన విధి యిట్టిదనియు, సాక్రమెంటులు (సంస్కారములవల్ల) మనము సాక్ష్యమిచ్చుచున్నామే కాని మరియొకటి కాదు" అని జువింగిలి అనువాయన వ్రాయుచున్నాడు. ఈ యభి

ప్రాయము కొరతకలదని ఆంగ్లేయసభ స్పష్టముగ ప్రకటించి దానిని నిషేధించెను.

## (2) సాక్రమెంటులు (సంస్కారములు) మనకు ఇయ్యబడుచున్న ఆత్మీయమైన లోపలి కృపకు కనుబడు వెలపలి గురుతులు.

శరీరముమీద ఉదకము చిలకరింపబడుట ఆత్మ పరిశుద్ధపరచబడుటకును; శరీరము నీటిలో ముంచబడుట పూర్వపు జీవమునకు చనిపోయి పాతిపెట్టబడుటకును; నీటిలోనుండి బయటికివచ్చుట నూతనజీవమునకు పునరుత్థానమవుటకును; నూతనవస్త్రములు ధరించుట క్రీస్తును ధరించుకొనుటకును గురుతుగా పరి. పౌలు చెప్పుచున్నాడు. అటువలెనే పరి. సమభాక్త్వములో రొట్టెను ద్రాక్షారసమును పుచ్చుకొనుట క్రీస్తు శరీరరక్తములలో పాలుపొందుటకును, ఒక రొట్టె విరుచుట ఒకే శరీరమందు అవయవములుగా నుండుటకును గురుతని ఆ యపొస్తులుడే చెప్పుచున్నాడు. ఈ విధముగ సువార్త సంస్కారములు రెండును మనకు ఇయ్యబడుచున్న ఆత్మీయమైన క్రియలు ఫలానివిధమైనవని మనకు స్పష్టముగ కనబరచునట్టి చిహ్నములని అపొస్తలుని బోధవల్ల ప్రత్యక్షమగుచున్నది.

ఈ యభిప్రాయమును స్వతంత్ర సభలును ఒప్పుకొనుచున్నవి. ఆంగ్లేయసభయొక్క ఉపదేశము, ఇంతమాత్రమే కాదు. హూకరు చెప్పినట్లు,

"వేదవాక్యము వినికిచేత నేర్పించు సత్యములను సాక్రమెంటులు ఇతర ఇంద్రియములమూలముగా మనుష్యులకు బోధించునేగాని వేరేకాదని నిరూపించుటకు కొందరు యత్నించుట బహు వ్యసనకరమైన సంగతి! ఈ బోధను పొందువారు వేదవాక్యము బహు స్పష్టముగా బోధించునట్టి బోధను అంగీకరించినయెడల చాలునని యెంచి, యీ యున్నత రహస్యములను విసర్జించుట యెంత సుళువైన సంగతి! దేవుడు వారికి దయచేసిన కృప యెట్టిదని దానిని పొందినవారికి బోధించుటకుమాత్రము సాక్రమెంటు ఆచరించినయెడల, ఆ బోధను గ్రహించుటకు శక్తిలేని పిల్లలకు దానిని ఆచరించుట అనవసరమైన వ్యర్థమైన పని యగునుగదా! గనుక దానికంటె శ్రేష్ఠమైన ఉన్నతబలము సాక్రమెంటులవల్ల కలుగుననుట నిశ్చయమని రూఢిచేసికొనుచున్నాము" అని చెప్పుచున్నాడు.

## (3) సాక్రమెంటులు (సంస్కారములు) దేవుని కృపకును, ఆయన మనకు చూపు అనుగ్రహమునకును నిశ్చయమైన సాక్ష్యములు.

సంస్కారములనుగూర్చి ఒక వెలలేని సత్యము దీనిలో నిమిడియున్నది. దేవుడు మానవులను రక్షించు పుణ్యకార్యములో సంస్కారములు దేవుని